# మహాపురుషుడు



పూజ్య గురుపత్ని శ్రీమతి అలివేలు మంగతాయారు

# మహాపురుషుడు

**దివ్యజనని అలివేలు మంగమ్మ**

**శ్రీ మంగ భరద్వాజ ట్రస్ట్,**

for **శ్రీ గురుపాదుకా పబ్లికేషన్స్**

"BHAKTA NIVAS", 12-1-170/46P, HANUMAN NAGAR
JAIPURI COLONY, NAGOLE
HYDERABAD-500 068

ANDHRA PRADESH, INDIA
WWW.SAIBHARADWAJA.ORG
WWW.SAIMASTERFORUMS.ORG
BOOKS@SAIBHARADWAJA.ORG

# విషయ సూచిక

# ముందుమాట

పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్ ఎంతటి వారో వర్ణించడానికి, వివరించడానికి మాటలు చాలవు. అయినప్పటికీ వారి గురించి స్మరించిన కొద్దీ త్రికరణాలు, చిత్తము శుద్ధి అవుతాయి గనుక, వారి గురించి మాట్లాడినా, వ్రాసినా మన వాక్కు శుద్ధి అవడమే కాక శ్రోతలకు, చదువరులకు కూడా పరమపదదాయకము కనుక, అట్టి ప్రయత్నం ఉత్తమోత్తమము. ఏ మహామనిషి ఉనికి వలన ఈ విశ్వం పావనమయిందో అట్టి మహాపురుషుడే ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్.

అంతటి మహనీయుని గూర్చి విస్తారమైన చరిత్ర ''భగవాన్ శ్రీ భరద్వాజ'', ''మహాత్ముల ముద్దు బిడ్డడు'', ''శ్రీ సాయిమాస్టర్ స్మృతులు'' మొదలైన గ్రంథాల్లో మనకు లభిస్తుంది. అయినప్పటికీ వారి మహిమను, వారి దివ్య చరిత్రను చెప్పడానికి ఎన్ని గ్రంథాలైనా, మాటలైనా చాలవు. వారి గురించి ఎంత తెలుసుకున్నా తనివి తీరదు.

సద్గురువు, పరాత్పరుడు, అనన్య

సామాన్యుడు అయిన పూజ్యశ్రీ భరద్వాజ మహరాజ్ గూర్చి, వారి రచనల గూర్చి, వారి బోధల గూర్చి సమాజం యావత్తుకు తెలియవలసిన అవసరం వున్నది. యావత్ మానవ సమాజము ఆధ్యాత్మిక శిఖరాలను అందుకోగలగాలంటే యివన్నీ విస్తారంగా తెలియక తప్పదు. వీరి రచనలలో ఒక గ్రంధాన్ని చదివినంతనే ఎంతో ఉత్తేజాన్ని పొందిన జెన్(బౌద్ధ ధ్యాన పద్ధతి) సాధకుడు, ప్రచారకుడు అయిన పాల్‌రెప్స్ అన్న మాటలు చరితార్ధములు. ఆచార్యుల గూర్చి ''మీరు మానవ జాతికి భగవంతుడిచ్చిన ప్రేమ కానుక'' అంటారాయన.

మాస్టర్‌గారిని స్మరించటానికి సాటి మరేది కాదు గనుక, అందుకు దోహదంగా ఈ గ్రంధం మీ ముందుంచబడుతుంది. అంతేకాక, కొత్త వారికి సైతం మాస్టర్ గారిని పరిచయం చేయడానికి ఈ గ్రంధం ఎంతో ఉపకరిస్తుంది.

పూజ్య ఆచార్యుల ధర్మపత్ని, మనందరికీ గురుపత్ని, అమ్మ అయిన పూజ్య అలివేలు మంగమ్మ దివ్య హస్తాలనుండి వెలువడిన అమృత బిందువులే ఈ రచనలు, వ్యాసాలు. అన్నాన్ని నమలలేని పసిబాలుల వలే ఆధ్యాత్మిక సూత్రాలను అర్ధం చేసుకోలేని మన కోసం ప్రేమతో అమ్మ తినిపించే

గోరుముద్దల్లా ఈ వ్యాసాలు ఎంతో సరళంగానూ, మధురంగానూ వుంటాయి. అవి ఆశ్వాదించిన మనకు మనోవికాసాన్ని ఆధ్యాత్మిక ఉన్నతిని, అన్నిటికంటే మించిన ఆచార్యుని స్మరణ సౌఖ్యాన్ని ప్రసాదిస్తాయి.

ఈ అత్యుత్తమ గ్రంధానికి ముందు మాటలు వ్రాయగలగడం, నా స్వహస్తాలతో ఈ గ్రంధాన్ని ఆవిష్కరించ గలగడం నేను మరువలేని మహద్భాగ్యం. చదువరులందరు, ఈ గ్రంధాన్ని ఆస్వాదించగలగాలని అధ్యాత్మిక శ్రేయస్సును పొందగలగాలని ప్రార్థన.

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

దేనినైనా తెలుసుకోవడం కోసం ప్రయత్నించేవాడిని ‘అన్వేషి’ అంటారు. అందుకు చేసే ప్రయత్నాన్ని ‘అన్వేషణ’ అంటారు. పూజ్యశ్రీ మాస్టరుగారు సత్యాన్వేషి మాత్రమే గాదు నిత్యాన్వేషి గూడ. ప్రతి విషయాన్నీ తెలుసుకోవాలనే జిజ్ఞాసతో ఆయన నిరంతరం అన్వేషిస్తూనే వుండేవారు. దానిని తెలుసుకునేవరకూ వదిలివచ్చేవారు గాదు. అంతేగాదు, ఆయన నిరంతరం ఏదో ఒక విషయాన్ని తెలుసుకునేందుకు అన్వేషణ జరుపుతూనే వుండేవారు.

ఉపనయనం ఎందుకు చేసుకోమని చెప్పారు? దానిలోని అంతరార్థమేమిటో తెలుసుకోవాలని ఆయన తాము ఉపనయనం చేసుకోవడానికి అంగీకరించారు. ఆయన జిజ్ఞాసకు మెచ్చిన భగవంతుడు మొదటిసారిగా ఆయనపై తమ అనుగ్రహాన్ని వర్షింపజేసి సరియైన ఉపదేశాన్ని ప్రసాదించారు.

రెండు సంవత్సరాల వయసుగల ఆయన పెద్దన్నగారి కుమారుడు సరిగా ఆయన ఉపనయన క్రతువులో జరిపే మంత్రోపదేశ

సమయంలో మరణించాడు. అదే ఆయనకు మహామంత్రోపదేశమైంది. అప్పుడు పూజ్యశ్రీ మాస్టరుగారు కాలేజీలో చదువుతూ పెద్దన్నగారైన శ్రీ కృష్ణమాచారిగారింట్లో వుండేవారు. పసిపిల్లవాడైన అన్నగారి రెండవ అబ్బాయిని పూజ్యశ్రీ మాస్టరుగారు ఎంతగానో ముద్దు చేసేవారు. ఆడించేవారు, లాలించేవారు. ఆ పిల్లవాడికి గూడ బాబాయి అంటే ఎంతో ఇష్టం. తమకు అత్యంత ప్రీతి పాత్రుడైన ఆ పిల్లవాని మరణంతో పూజ్యశ్రీ మాస్టరుగారి హృదయానికి తీవ్రాఘాతం తగిలింది. ఇది ఆయన జీవితంలో తగిలిన రెండవ దెబ్బ. పసితనంలోనే మాతృశ్రీ మరణంతో తగిలిన హృదయాఘాతాన్ని తట్టుకోవడానికి చాలా సం॥లు పట్టింది. అయినా అంతరాంతరాలలో వ్యథ చెందిస్తూనే వున్నది. దానికితోడు అలాంటిదే మరొక దెబ్బ. దెబ్బ మీద దెబ్బ తగలడంలో ఆ వేదనకు అంతులేకుండా పోయింది. అందులోనుంచే - మానవులను ఇంత వ్యధను కలిగించే ఈ మరణాన్ని జయించలేమా? అన్న ప్రశ్న ఉదయించింది. అయితే ఈ మృత్యువును జయించలేకపోతున్న కారణమేమిటి? తెలుసుకోవాలన్న జిజ్ఞాస కలిగింది. అంతటితో అన్వేషణ ప్రారంభమైంది.

అసలు మరణమంటే ఏమిటి? జననమంటే ఏమిటి? జన్మించిన ప్రతి జీవీ మరణించితీరవలసినదేనా? అలా నిర్దేశించినది ఎవరు? ఎవరైనా వుంటే అట్టివారి ప్రణాళిక ఏమిటి? మరణించిన తర్వాత ఏమవుతారు? మళ్ళీ జన్మనెత్తవలసివుంటుందని చెబుతున్నారు గదా! మరి మళ్ళీ ఎవరు ఎక్కడ జన్మిస్తారు? మళ్ళీ ఈ జన్మసంబంధాలతోనే పుడతారా? ఒకవేళ అలా జరిగితే మళ్ళీ జన్మ ఎత్తినప్పుడు క్రిందటి జన్మలోని సంబంధాలు ఎందుకు గుర్తు వుండడం లేదు? అసలు ఈ జన్మలోనుంచి మరొక జన్మలోకి వెళ్ళేది ఏమిటి? జీవుడు అయితే ఎలా వుంటాడు? మళ్ళీ మరొక గర్భంలో ఎలా ప్రవేశిస్తాడు? ఏ జీవికి ఆ జీవి స్వతంత్రుడా? స్వతంత్రుడైతే తనకు కావలసిన జన్మను ఎత్తగలడు గదా! అలాగే జరుగుతున్నదా? జరగడం లేదా? క్రిందటి జన్మల సంబంధాలలోనే ఒకవేళ కొనసాగితే అలాగే జరిగిందని అనుకోవడమెలా? దీనికంతటికీ కర్త ఎవరైనా వున్నాడా? వుంటే ఎక్కడ ఎలా వుండి నడిపిస్తున్నాడు? అసలు మరణమంటే ఏమిటో తెలుసుకుంటే గాని జననమంటే ఏమటో తెలుసుకోవడానికి వీలులేదేమో!

ఈ సృష్టి అంటే ఏమిటి? పరిమితమైనదా?

అపరిమితమైనదా? ఇది ఎంతకాలం యిలా కొనసాగుతుంది? దీనికి అంతము ఎప్పుడు? అసలు కాలమంటే ఏమిటి? కాల స్వరూపమేమిటి? ఈ సృష్టికీ, కాలానికీ వున్న సంబంధమేమిటి? ఈ సృష్టిని నడిపించేవాడు భగవంతుడే అయితే అతడు ఎలా వుంటాడు? సాకారుడా? నిరాకారుడా? సాకారుడైతే అతని ఆకారమేమిటి? నిరాకారుడైతే గుర్తుపట్టేదెలా? భగవంతుడు ఒక్కడే అయితే ఈ దేవతలందరూ ఎవరు? ఈ దేవతల తత్త్వమేమిటి? పూజించడమంటే ఏమిటి? భగవంతుడు కోరికలు తీరుస్తాడంటున్నారు గదా! ఆయన కోరికలు ఎలా తీరుస్తాడు? మరి మృత్యువు వద్దనే కోరికను ఎందుకు తీర్చడం లేదు? దీనిలోని అంతరార్థమేమిటి?

ఇలా తెంపులేని ఆలోచనలు! అసంఖ్యాకములైన ప్రశ్నలు?! సమాధానాల కోసం అన్వేషణ, తపన! ఆయన అన్వేషణ కేవలం ఆలోచనలకే పరిమితం కాలేదు. ఈ సృష్టి ఏమిటి? ఈ పదార్థం ఏమిటి? ప్రాణం అంటే ఏమిటి? ఆలోచనలు కలిగించే మనస్సు తత్వమేమిటి? ఇదంతా అనుభవిస్తున్నది ఎవరు ?

ఇలా ప్రశ్నల పరంపర కలుగుతూ వుంటే ఆయన అందరిలాగా ''మనకెందుకులే'' అనుకోలేదు. ఎవరో పెద్దలో, లేక పుస్తకాలో చదివి వాటిలోని విషయాలను గుడ్డిగా నమ్మలేదు. అన్నిటినీ తన స్వయం కృషితో గమనించనారంభించారు. ప్రాణులు, వస్తువులు, భావాలు, అనుభవాలు, సమాజాలు, ఆరోగ్యము, నెప్పి, ఇష్టాయిష్టాలు, సాంఘిక పరిస్థితులు, ఇలా అన్నిటినీ తీవ్రంగా గమనించేవారు. తనలో తాను వీటన్నిటినీ నిష్కర్షగా ప్రశ్నించేవారు. తమ ప్రజ్ఞను, ఆలోచనా శక్తిని, విషయగ్రహణ శక్తిని, పరిశీలనా శక్తిని మరింత పెంపొందించుకునే ప్రయత్నం చేసేవారు. ఈ సృష్టి ఎలా నడుస్తోందో తన శరీరం ఎందుకు ఎలా పనిచేస్తోందో, మనస్సు ఎలా పనిచేస్తోందో ఎంతో నిశితంగా గమనించేవారు. అలా గమనించడానికి వీలుగా పరిస్థితులను ఏర్పరుచుకునేవారు. నిద్ర, స్వప్నము మొదలైన విషయాలను సైతం ఆయన విడువలేదు. ఇతర జీవులలో ప్రాణశక్తి ఎలా పనిజేస్తున్నదో గమనించేవారు. వాటి అనుభవం, సృష్టిని ఆ జీవులు దర్శించే విధానం ఎలా వుంటుందో అంచనా వేసేవారు. ఇలా వారు గడిపిన నిరంతర కృషి కొన్ని సంవత్సరాల పాటు

తదేకంగా సాగింది. అది తీవ్రమైన, సంకీర్ణమైన అన్వేషణ. అదొక మహా సత్యశోధన. ఒక యజ్ఞం. ఒక ప్రశస్థమైన సాధన.

పూజ్యశ్రీ మాస్టరుగారిలో ఈ విధమైన అంతర్మధనం జరుగుతుండగా ఆయన ఒకరోజు ఒంగోలులో ఊరిబయటకు వ్యాహ్యాళికి వెళ్ళారు. త్రోవలో ఆయన తలలో పెద్ద శబ్దమైంది. వెంటనే మనస్సు ప్రశాంతమైంది! ఆ మనస్సులో ఎట్టి ఆలోచనలూ లేవు! సందేహాలు లేవు! అసలు ప్రశ్నలే లేవు!! శాంతి! శాంతి! అంతులేని ప్రశాంతి!!

''అంతటితో ప్రధానమైన నా ప్రశ్న అప్రస్తుతమనిపించింది'' అని ఆయనే శ్రీ సాయిలీలామృతంలో వ్రాశారు.

అంతటితో ఆయన అన్వేషణ ఆగలేదు. ఈ సృష్టి గురించి విజ్ఞాన శాస్త్రవేత్తలు ఏమి చెప్పారో తెలుసుకోవడానికి ఆయన వైజ్ఞానిక గ్రంథాలనెన్నింటినో చదివారు. ఆయా గ్రంథాలలో విజ్ఞాన శాస్త్రవేత్తలు కనుగొన్న విషయాలు, తాము స్వయంగా ఆలోచించి తెలుసుకున్న విషయాలకు సరిగ్గా సరిపోవడంతో ఆయన అలోచనలు సరియైనవేనన్న విశ్వాసం కలిగింది. అంతేగాక ఎవరైనా సరే, నిజమైన జిజ్ఞాసతో ఆలోచిస్తేను,

అన్వేషిస్తేను వారికి గూడ ఒకే విధమైన విషయాలు అవగతమవుతాయని తెలుసుకున్నారు. కారణం సత్యం (ఉన్నది) ఒకటే అయినప్పుడు ఒకే మానసిక స్థాయికలిగిన ఎవరికైనా ఆయా విషయాలు అదే విధంగా అవగతమయితీరాలి గనుక.

ఆ తర్వాత సం॥ 1963లో భగవంతుని మీద, మహాత్ముల మీద తమకెట్టి విశ్వాసమూ లేకపోయినప్పటికీ రెండవ అన్నగారు సాయి దర్శనానికి శిరిడీ వెళ్తూ పూజ్యశ్రీ మాస్టరుగారిని రమ్మని బలవంతం చేయడంలో ఆయనకు తోడుగా మాత్రమే శిరిడీ వెళ్ళారు. ఆ ప్రధమ దర్శనంలోనే సమర్థ సద్గురుడైన శ్రీ శిరిడీ సాయినాథుడు ఆయనకు ఈ విశ్వానికి మూలమైన, ఆధారమైన, నిత్యసత్యమైన, ఆత్మానుభూతిని ప్రసాదించారు. ఆ అనుభవంలో ఆయనకు ఈ సృష్టితత్త్వమేమిటో అర్థమైపోయింది. ఈ సృష్టికి మూలమైన పరమాత్మను చేరుకోవడమే మానవజీవిత పరమార్థమని ఆయనకు అవగతమైంది. అందుకు మార్గం చూపగల సద్గురువు యొక్క ఆవశ్యకత ఎంతగానో అవసరమని, సద్గురువును ఆశ్రయిస్తే ఆయన గమ్యాన్ని చేరగలడని, గమ్యం గూడ అట్టి సద్గురువేననీ ఆయన గ్రహించారు.

అప్పటినుంచీ ఆయన అన్వేషణ మరో మలుపు తిరిగింది. సద్గురువైన సాయినాథుని గూర్చి తెలుసుకునేందుకు ఆయన నిరంతరం అన్వేషణ ప్రారంభించారు. ఆయన గూర్చి కనిపించినవారినల్లా అడిగారు. భుజాన ఒక సంచీ మాత్రమే తగిలించుకుని ఆయన గూర్చిన వివరాలకోసం ఊరూరా తిరిగారు. ఆయనను చూసినవారి వద్దకు వెళ్ళి ఆయన గూర్చిన చిన్న వివరాన్ని సైతం విడువక వారి నుంచి సాయిని గూర్చి తెలుసుకున్నారు.

అంతేగాక శ్రీ సాయిబాబా మీద ప్రచురింపబడిన గ్రంధాలను పఠించారు. ''శ్రీ సాయిలీలా మాసపత్రిక (మరాఠీ)''లోని ప్రచురణలను అన్నింటినీ చదివారు. మరాఠీ, ఇంకా ఇతర భాషలలో వున్న సాయి గూర్చిన గ్రంధాలలోని విషయాలను చదివించుకుని విన్నారు. ఎంతోమంది సాయిని ప్రత్యక్షంగాదర్శించిన వారి అనుభవాలు, సమాధి చెందిన తర్వాత శ్రీ సాయి ఎందరికో ప్రసాదించిన అనుభవాలను సేకరించారు. వాటినన్నింటినీ అద్భుతమైన కూర్పుతో గ్రంధస్థం చేసారు.

అప్పుడాయనకు భగవంతుడు ఒకడే

అయితే భగవంతుడి గూర్చి తెలిపే వివిధ మతాలు ఎందుకేర్పడ్డాయి? అనే ప్రశ్న ఉదయించింది. ఆయా మతాలలో ఏమేమి చెప్పారో తెలుసుకోవాలని అన్వేషణ ప్రారంభించారు. వివిధ మతాల గ్రంథాలు చదివారు. ఉన్నది ఒకే భగవంతుడని, ఆయనను తెలుసుకోవడానికి ఆయాదేశకాల పరిస్థితులను బట్టీ వివిధ మతాలు ఉద్భవించాయనీ తెలుసుకున్నారు.

ఆయా మతాలలో చెప్పిన బోధలననుసరించి సాధన చేసిన ఆయా మతాలలోని పరిపూర్ణులైన మహాత్ముల చరిత్రలు చదివారు. వారందరూ తెలుసుకున్న సత్యం ఒక్కటేనని ఆయన గ్రహించారు.

అసలు నిజమైన ఆధ్యాత్మికత అంటే ఏమిటి? అటువంటి ఆధ్యాత్మికత సాధించడానికి కావలసిన ముఖ్యమైన అంశాలేమిటి? మనస్సుయొక్క తత్త్వమేమిటి! మనస్సును జయించడమెలా? నిజమైన ఆధ్యాత్మికవేత్త ఎలా వుంటాడు? నిజమైన భక్తుడు ఎలా వుంటాడు? నిజమైన యోగి ఎలా వుంటాడు? సిద్ధుడు ఎలా వుంటాడు? దొంగ, నకిలీ ఆధ్యాత్మికులను గుర్తుపట్టేదెలా? మొ॥న విషయాలగురించి ఎన్నో గ్రంథాలు చదివి, పరిశోధించి తెలుసుకున్నారు.

అంతటితో ఆయన అన్వేషణ పూర్తి కాలేదు. విజ్ఞాన శాస్త్రం చెప్పే సృష్టి తత్త్వాన్ని, ఆధ్యాత్మికత చెప్పే సృష్టి తత్త్వానికీ సంబంధమేమైనా వున్నదా? ఈ రెండిటికీ సమన్వయం కుదురుతుందా? లేకపోతే ఎక్కడ విభేదించింది? మొ॥న విషయాలను పరిశోధించి వైజ్ఞానిక పరంగా ఆధ్యాత్మికతకు సమన్వయం వుందని తెలుసుకున్నారు.

ఇంకా ఆయన అన్వేషణ యిలా కొనసాగింది -

ఆధ్యాత్మికతకు, లౌకిక జీవితానికీ ఏమైనా సంబంధమున్నదా? లౌకిక జీవితం సుఖశాంతులతో వుండడానికి ఆధ్యాత్మికత ఎలా పనికివస్తుంది? సమాజానికి ఆధ్యాత్మికత ఎలా ఉపయోగపడుతుంది? అసలు ఈ సమాజం ఎందుకు యిలా వున్నది? సరిగా వుండడానికి చేయవలసినదేమిటి?

ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన అన్వేషించని అంశం లేదు. పరిష్కారం కనుగొనని సమస్యా లేదు. ప్రతి విషయాన్నీ నిశితంగా, నిర్దుష్టంగా, నిర్కర్షగా, సంపూర్ణంగా అన్వేషించి పరిశోధించి పరిష్కారాలు కనుగొన్నారు.

ఆయన పరిశోధించిన అంశాలలో మచ్చుకు

కొన్ని :-

కుటుంబ సమైక్యత, దేశ సమైక్యత, ప్రపంచ సమైక్యత.

వివిధ మత సమైక్యత. (సమ సమాజ నిర్మాణము).

పిల్లల పెంపకము, ఆరోగ్యము.

యువకుల సమస్యలు, వ్యక్తిత్త్వ నిర్మాణము.

గృహస్థుల ధర్మము, నిర్వహణ, విధులు.

వృద్ధుల కర్తవ్యము.

వైద్యము.

విద్య.

కళలు.

రాజకీయాలు, నాయకులు, రాజ్యపాలన, నిజమైన ఆధ్యాత్మికతను పెంపొందించుట, నకిలీ అధ్యాత్మికతను నశింపజేయుట-మానవాళికి సుఖశాంతులు కలుగజేయగలందులకు లౌకికంగాను, పారమార్ధికంగానూ ఇంకా యింకా ఏమి చేయాలి? అని ఆయన జీవితాంతమూ ఆలోచిస్తూనే వున్నారు. ప్రయత్నిస్తూనే వున్నారు. పరిశోధిస్తూనే వున్నారు. ప్రబోధిస్తూనే వున్నారు.

*అందుకే ఆయన సత్యాన్వేషి, నిత్యాన్వేషి.*

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

పూజ్యశ్రీ మాష్టరుగారు శిరిడీ దర్శించి సద్గురు శ్రీ సాయినాథుని అనుగ్రహం పొందినప్పటినుంచి ఆయనను సశరీరులుగా చూడలేకపోయానని చూస్తే బాగుండేదని అనిపించసాగింది. అందుకని అటువంటి పరిపూర్ణులైన సశరీరులైన మహాత్ముల దర్శనమైనా ప్రసాదించవలసినదని శ్రీ సాయినాథుని ఆయన ప్రార్థించారు. శ్రీ సాయినాథుని అనుగ్రహం వల్ల ఆయనకు ఎందరో మహాత్ములను దర్శించే భాగ్యం లభించింది.

ఆయన ఏ మహాత్ముల దగ్గరకు వెళ్ళినా ప్రథమంగా వారి పాదాలకు నమస్కారం చేసుకునేవారు. వారివద్ద భక్తి ప్రపత్తులతోను, వినయ విధేయతలతోనూ మెలిగేవారు. తానొక భక్తుడనని గానీ, సాధకుడనని గానీ, శ్రీ సాయిబాబా తమకు అంతటి దివ్యానుభవాన్ని ప్రసాదించారని గానీ ఆయన గర్వపడడం గానీ, గొప్పగా చెప్పకోవడం గానీ చేసేవారు గారు. కనీసం తాను సాయి భక్తుడనని కూడా చెప్పకునేవారు గాదు. ఒక సాధారణమైన వ్యక్తి లాగానే వారివద్ద

ప్రవర్తించేవారు. వారియొక్క (ఆ మహాత్ముల యొక్క) దివ్య సన్నిధిని సాధ్యమైనంత అనుభవించడానికి ప్రయత్నించేవారు. వారు ఇతరులతో మాట్లాడే మాటలు శ్రద్ధగా వింటూ, వాటిలోని పరమార్థాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించారు. అవసరమనుకున్నప్పుడు పరిప్రశ్న చేసేవారు. ఆ మహాత్ములు చెప్పే సమాధానాలలో తమకేదైనా సందేహాలుంటే తిరిగి తిరిగి తెలుసుకునేవారు. ఎవ్వరూ మాట్లాడని సమయంలో మౌనంగా కూర్చునేవారు.

చాలా తక్కువగా మాట్లాడుతూ, ఎక్కువగా మౌనంగా వుండే అవధూతల దగ్గర ఆయన గూడా మౌనంగా వారిని చూస్తూ, వారి చర్యలను గమనిస్తూ, ధ్యానం చేసుకుంటూ, అవసరమైతే సేవ చేస్తూ వుండేవారు.

ఆయన మహాత్ముల దర్శనం కోసం ఎంతో ఆతృత, తపన పడేవారు. మహాత్ములు, అవధూతలు ఎక్కడెక్కడ వున్నారో తెలుసుకొని వెంటనే వారి దర్శనార్థం వెళ్ళేవారు. వారి దర్శనం కోసం ఆయనకుండే ఆరాటంలో ఎన్ని ఇబ్బందులు ఎదురైనా ఆయనకు పట్టేదిగాదు. ఒక్కొక్కచోట ఆయనకు భోజన వసతి వుండేది గాదు.

ఒక్కొక్కప్పుడు ఆయనకు ఇతర కనీస సౌకర్యాలకు గూడ ఇబ్బందిపడవలసివచ్చేది.

ఆయన ఎప్పుడూ గూడ మహాత్ముల దర్శనానికి వెళ్ళడానికి ముందుగా అనుకోవడమూ, రిజర్వేషన్‌లాంటివి చేయించుకోవడమూ చేసేవారు గాదు. సెలవలు వచ్చాయంటే అప్పటికప్పుడు ఎక్కడకు వెళ్ళాలని బుద్ధిపుడితే అక్కడకు వున్నపళంగా ఒక చిన్న సంచీలో ఒకజత బట్టలు పెట్టుకుని బయల్దేరేవారు. అలాగే ఒకసారి ఆయన చేసిన ప్రయాణంలో టిక్కెట్టు దొరికింది గాని రైలులో నిలబడడానికి గూడా స్థలం లేకుండా జనం కిటకిటలాడుతున్నారు. అప్పుడాయన రైలుపెట్టె తలుపు దగ్గర కడ్డీ పట్టుకుని చివరగా నిలబడ్డారు. అర్ధరాత్రి అయింది. సాయంత్రం నుంచీ నిలబడడంతో కాళ్ళు లాగేస్తున్నాయి. అంతకుముందు రెండు, మూడు రోజులుగా నిద్రలేకపోవడంతో నిద్ర ముంచుకొస్తున్నది. రైలు వాకిలి కడ్డీని పట్టుకున్న ఆయన చేతులు రెండు, మూడు సార్లు నిద్ర వల్ల పట్టు తప్పాయి. ఇక యిలా లాభం లేదనుకొని ఆయన తన దగ్గరున్న టవల్‌తో తన నడుముకు, రైలు పెట్టె చువ్వకు(కడ్డీకి) కలిపి గట్టిగా బిగించి కట్టుకుని అలాగే తెల్లవార్లూ ప్రయాణం చేశారు.

అలాగే ఆయన నైమిశారణ్యానికి ఆనందమాయి దర్శనానికై వెళ్ళారు. అక్కడ ఎటువంటి వసతి లభించలేదు. తినడానికి ఆహారము ఏమీ దొరకక, గడ్డ కట్టే చలిలో రాత్రంతా ఒక చెట్టు క్రింద కూర్చొని గడపవలసివచ్చింది. అందువలన ఆయనకు తీవ్రంగా జలుబు, జ్వరమూ గూడా వచ్చాయి. కానీ ఆయనకు అవేమీ పట్టలేదు.

అలాగే ఒకసారి ఎవరో మహాత్ముని ఆచూకీ తెలిసి ప్రయాణమయ్యారు పూజ్యశ్రీ మాష్టరుగారు. ఆరోజు మధ్యాహ్నం నాలుగు గంటల ప్రాంతంలో ఒక పల్లెటూరు దగ్గర ఆయన ప్రయాణిస్తున్న బస్సు ఆగిపోయింది. పూజ్యశ్రీ మాష్టరుగారు రాత్రి నుంచీ ఏమీ తినలేదు. విపరీతంగా ఆకలిగా వున్నది. విచారించగా ఆ ఊరిలో ఒక చిన్న హోటలు వున్నదని తెలిసింది.వెళ్ళి భోజనము అడిగితే హోటలు యజమాని భోజనం అయిపోయిందని చెప్పాడు. పోనీ ఏదైనా ఉపాహారం (టిఫెను) వుంటే పెట్టమంటే అది గూడా అయిపోయిందని తాను కడుగుతున్న ఖాళీ గిన్నెలు చూపించాడు. చిరుతిండ్లు ఏమైనా వున్నాయా అని అడిగారు పూజ్యశ్రీ మాష్టరుగారు. అందుకతడు క్రిందటిరోజు చేసిన గారెలు వున్నాయన్నాడు. అవే తీసుకురమ్మంటే

అతడు వాటిని పెట్టాడు. తీరా చూస్తే అవి పాడైపోయి వాసన కొడుతున్నాయి. పూజ్యశ్రీ మాష్టరుగారు ఆరోజు అదే భగవంతుడు యిచ్చిన ప్రసాదమని భావించి తినేసారు. ఆయన జీవితంలో ఇలాంటి సంఘటనలు ఎన్నో...

పూజ్యశ్రీ మాష్టరుగారు సెలవులలో ఎక్కడకు వెళ్ళినా తమ దగ్గర వున్న పైకమంతా తీసుకుని వెళ్ళేవారు. తిరుగు ఛార్జీలకు మాత్రమే వుంచుకొని మిగిలినదంతా ఖర్చుపెట్టేవారు. ఒకసారి ఆలాగే తిరుగు ప్రయాణానికి టికెట్టుకొనుక్కొని రైలెక్కారు. అది తిరుపతి వెళ్ళే రైలు. ఆయన గూడూరులో దిగాలి. రాత్రి చాలాసేపు చదువుకుంటూ వుండి తర్వాత పడుకున్నారు. మంచి నిద్ర పట్టి గూడూరు స్టేషన్‌లో ఆయనకు మెలుకువ రాలేదు. రైలు తిరుపతిలో ఆగింది. ఆయన నిద్రపోతూనే వున్నారు. అందరూ దిగిపోయారు. చివరకు రైలు శుభ్రం చేసేవాడు వచ్చి పూజ్యశ్రీ మాష్టరుగారిని నిద్రలేపాడు. లేచి చూస్తే అది తిరుపతి. ఆయన జేబులో కాఫీ త్రాగడానికి మాత్రమే డబ్బులు వున్నాయి. నిశ్చింతగా ఆయన ఆ డబ్బులతో కాఫీ త్రాగి ప్లాట్‌ఫారం మీద కూర్చుని బాబాను స్మరించుకుంటున్నారు. కాసేపటికల్లా ఆయన దగ్గర ఎప్పుడో చదువుకున్న విద్యార్థి వచ్చి

టికెట్టు కొనిచ్చి, తిరుగు ప్రయాణానికి అవసరమైన డబ్బులిచ్చి రైలు ఎక్కించాడు!

శిరిడీ మొ॥ పుణ్యక్షేత్రాలలోనూ, మహాత్ముల సన్నిధిలోనూ పూజ్యశ్రీ మాష్టరుగారు పాద రక్షలు వేసుకునేవారుగాదు. ఒక్కొక్కసారి ఎండవలన ఆయనకు పాదాలు బొబ్బలు ఎక్కేవి. అయినా ఆయన ఆలాగే నడచేవారు.

ఆయనకు విపరీతమైన నోటిపూత వుండేది. ఒక్కొక్కసారి మంచి నీళ్ళు గూడ త్రాగలేకపోయేవారు. అట్టి పరిస్థితులలో గూడ మహాత్ముల దర్శనానికి వెళ్ళినప్పుడు అక్కడ ఆయన తినగలిగిన పదార్థాలేవి వుండేవిగావు. ఒక్కొక్కసారి కాఫీ గూడ దొరికేది గాదు. అయినా ఆయనేమీ బాధపడేవారుగాదు. మంచి నీళ్ళు మాత్రమే త్రాగి తృప్తిగా వుండేవారు.

ఆయన ఏ మహాత్ముని దర్శనార్థం వెళ్ళినా వారి దర్శనం కోసం ఎంతసేపైనా వేచి వుండేవారు. వారి దర్శన ఆశీస్సులు ప్రసాదించమని శ్రీ సాయినాథుని ప్రార్థించేవారు గానీ (ఇంతటి భక్తుడినైన) నాకు వారు దర్శనమివ్వలేదు, నన్ను గుర్తించలేదు అని వారిపై కినుక వహించడం చేసేవారు గాదు. వసతి సౌకర్యాలు లభించకపోయినా అక్కడవారి

మీదగానీ, అక్కడి పద్ధతి మీద గానీ ఆయన ఆగ్రహించేవారుగాదు. శ్రీ సాయినాథుడు ఆ రోజున తమను అలా వుంచారని అనుకునేవారు.

ఆయన మహాత్ముల దర్శనార్థం వెళ్ళినప్పుడు తాము వచ్చిన పని చూసుకునేవారుగానీ అన్యవిషయాలపై దృష్టి సారించేవారు గాదు. తమ చర్యలవల్ల, మాటలవల్ల ఎవరికీ ఇబ్బంది కలగకుండా ప్రవర్తించేవారు. మహాత్ముల సన్నిధిలో అవకాశమున్నంతవరకూ గడిపేవారు. వారిని నిశితంగా పరిశీలిస్తూ వుండేవారు. వారి సన్నిధిలో లేని సమయంలో అక్కడ వున్న వారిని, అక్కడకు వచ్చేవారిని ఆ మహాత్ముని గూర్చి అడిగి తెలుసుకునేవారు.

మహాత్ముల దగ్గరకు వెళ్ళినప్పడే గాదు, ఎక్కడ ఎవరు పరిచయమైనా వారు ఏయే ప్రాంతాలవారో తెలుసుకుని, ఆయా ప్రాంతాలలోని సశరీరులైన, సమాధి చెందిన మహాత్ముల గురించి అడిగి తెలుసుకునేవారు. వారి చరిత్రలు వుంటే వెంటనే తెప్పించుకుని చదివేవారు. సాధ్యమైనంత త్వరలో వారి దర్శనం చేసుకునేవారు.

ఆవధూతలు సాధారణంగా మురికి కాలువల ప్రక్కన, అందరూ మల మూత్ర విసర్జన

చేసే ప్రదేశాలోనూ, రోడ్డు మీద, ఎక్కడ పడితే అక్కడ కూర్చుంటూ, నిలకడ లేకుండా ఇష్టమొచ్చినట్లు తిరుగుతూ వుంటారు. అటువంటి అవధూతల దర్శనార్థం వెళ్ళినప్పుడు పూజ్యశ్రీ మాష్టరుగారు అసహ్యామనేది లేక అక్కడే గంటల తరబడి కూర్చునేవారు. అది చుసిన ఒకరు యిలా అన్నారు : ''ఆ రోజులలో భగవద్భక్తి ఆంటేనే ఎగతాళి. మహాత్ముల దర్శనం చేసుకునేవారే అరుదు. అలా చేసుకునేవాళ్ళంటే పిచ్చివాళ్ళన్న చులకన భావం ప్రజలలో వుండేది. భరద్వాజగారి మాటల ప్రభావం వలన ఒకసారి వారితో పాటు చీరాల స్వామి దర్శనానికి వెళ్ళాను. స్వామి అందరూ మలముత్ర విసర్జన చేసే ప్రదేశంలో ఎండలో కూర్చుని వున్నారు. భరద్వాజగారు బస్సు దిగినప్పటి నుంచీ కాళ్ళకు చెప్పలు లేకుండానే స్వామి దర్శనానికి వచ్చారు. అక్కడ ఆయన కూర్చున్న చోటనే నేలమీద కూర్చున్నారు. ఒక వైదిక సాంప్రదాయంలో పుట్టినవాడు, శ్రీ వైష్ణవ బ్రాహ్మణుడు, పైగా కాలేజీలో ఉపన్యాసకుడు - ఎవరైనా తమను చూస్తారనే బిడియం లేకుండా అలా కుర్చుండిపోవడం చూసి ఆశ్చర్యపోయాను. నేను స్వామికి నమస్కారం చేసుకుని, కాసేపు దూరంగా నిలబడి వచ్చేసాను.

ఆయన ఆధ్యాత్మిక స్థితి, స్వామి స్థితికి ఏమి తీసిపోదని నాకనిపించింది''.

అంతేగాదు, మహాత్ములు ఏదైనా ప్రసాదం పెడితే, అది తాము తినగలిగినదైనా, తినలేకపోయినదైనా సరే వెంటనే తినేసేవారు. ఒకసారి ఒక మహాత్ముడు ఆయనకు 'చెరుకుగడ' ప్రసాదంగా యిచ్చారు. అప్పుడు పూజ్యశ్రీ మాష్టరుగారికి నోటిపూత విపరీతంగా వున్నది. మాట్లాడలేని స్థితిలో వున్నారు. ఇక చెరుకు గడ తినడమంటే సామాన్య విషయమా! మామూలు వ్యక్తులకే చెరుకు ముక్క ఒకటి తింటేనే నాలుక గరుకుగా అయిపోతుంది. అలాంటిది ఆయనన నోటిపూతతోనే చెరుకుగడ మొత్తం తిన్నారు! ఇక ఆయన నోటి పరిస్థితి ఎలా వుండి వుంటుందో ఊహించగలమా! ఆయన నాలుక నుండీ రక్తం వచ్చింది!!

అంతేగాదు, పూజ్యశ్రీ మాష్టరుగారి గృహానికి మహాత్ములు వచ్చినప్పుడు ఆయన ఆనందం వర్ణనాతీతం!! వారికి ఎటువంటి లోటూ రాకుండా అనుక్షణమూ వారి ప్రతి అవసరాన్ని శ్రద్ధగా చూసుకునేవారు. అక్కడ - అంటే తమ ఇంట్లో - తాము ఒక గురువు స్థానంలో వున్నాననే భావన

ఆయనలో లేశమైనా వుండేదిగాదు. వారిచెంతన వినమ్రులై వుండేవారు. అందరూ ఆ మహాత్ముల దర్శనం చేసుకోవాలని తహతహలాడేవారు. తమకు తెలిసిన వారందరికీ కబురు పంపించేవారు. వచ్చినవారికి ఆ మహాత్ముల దర్శనం లభించేలా చూసుకునేవారు.

ఆయన కొన్నాళ్ళు జిల్లెళ్ళమూడి అమ్మ ఆశ్రమంలో వున్నారు. అక్కడ ఆయన ఆశ్రమానికి అవసరమైన సేవలు చేసేవారు. అక్కడ ముద్రింపబడుతున్న 'మాతృశ్రీ' అను తెలుగు, ఆంగ్ల పత్రికలకు వ్యాసాలు వ్రాయడము, ఆ పత్రికలోని వ్యాసాలకు ప్రూఫ్‌లు దిద్దడమూ మొ।।నవి చేసేవారు. అలాగే అవసరమైనప్పుడు ఆశ్రమానికి చెరువు నుంచీ నీళ్ళు బిందెలతో మోసుకొచ్చేవారు. అక్కడకు వచ్చినవారితో ఆధ్యాత్మిక విషయాలగూర్చి మాట్లాడుతుండేవారు గానీ, వ్యర్థంగా ఒక్క క్షణం గూడా గడిపేవారు గాదు.

" భగవాన్ హై భరద్వాజ! " అని, ఆయన శంఖు చక్రాలతో విష్ణుమూర్తిలా తమకు దర్శనమిచ్చారనీ మహాత్ములే చెబుతుండగా ఆయన మహాత్ముల దర్శన సేవలకై పరితపించడమేమిటి?

అవతార పురుషుడైన శ్రీ రాముడు

మునులను, ఋషులను సేవించినట్లే, కొందరు మహాత్ములు గూడా ఇతర మహాత్ముల దర్శన, సేవలు చేసినట్లే పూజ్యశ్రీ మాష్టరుగారు గూడ మనకు ఆదర్శంగా వుండడానికి మహాత్ములను సేవించారా? - ఆలోచిస్తే అదే నిజమనిపిస్తుంది!

*" యద్యదాచరతి శ్రేష్ఠః తత్తేద్దేవే తరోజనాః ।*
*సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ "*

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

పూజ్యశ్రీ మాస్టరుగారు మహాత్ములనెందరినో సందర్శించారు. శ్రీ శిరిడీ సాయినాధుని సమాధి దర్శనంతోనే తమకంతటి అనుభూతి కలగటం, శ్రీ సాయి సన్నిధి భక్తులలో ఎట్టి మార్పు కలిగించేదో చూసినమాష్టర్‌గారువారినిలోకానికిఅందించారు. అటువంటి మహాత్ముల సందర్శనం కోసం ఎంతో తపించేవారు. వారిలోని ఆకాంక్షకు సంప్రీతులైన మహాత్ములు వారినెంతగానో ఆదరించారు, ఆశీస్సులనందించారు, ప్రసంశించారు.

ఆయన సందర్శించిన మహాత్ములలో ప్రతి ఒక్కరూ ఆయనను చూడగానే తమ ప్రియపుత్రుని చూసినట్లు ఎంతో ఆనందించేవారు. వారి అత్యున్నత ఆధ్యాత్మిక స్థాయికి తమదైన శైలిలో జోహార్లు తెలిపేవారు. మహాత్ములందరూ ఆంతర్యంలో ఐక్యం కలిగి వుంటారు కనుక వారి సమాగమం ఎంతో అద్భుతంగా వుండేది.

ఆత్మకూరు వద్దనున్న అనంతసాగరంలో నాగమునీంద్రస్వామిఅనుఒకమహాత్ముడుండేవారు. ఒకసారి పూజ్యశ్రీ మాస్టరుగారు కొంతమందితో కలిసి ఆ స్వామి దర్శనార్ధం వెళ్ళారు. ఆయన

కొబ్బరికాయలు కొట్టి ఆ నీళ్ళు, ''గంగ, యమున, సరస్వతీ'' అంటూ అందరి శిరస్సులపై పోస్తున్నారు. పూజ్యశ్రీ మాస్టరుగారు కూడా ఆయన ముందుకు వెళ్ళగానే ఆయన, ''అబ్బో, అబ్బో! నీకు కూడా కావాలా అయ్యా!'' అన్నారు. అంటే పూజ్యశ్రీ మాస్టరుగారికి అట్టివి అవసరంలేదనేగదా! ఆయనే మరొకసారి, ''ఆ బాపనయ్య బాబా మనిషయ్యా! చాలా మంచివాడు. దొంగలను గూడా బాగు చేయాలనుకుంటాడు. అంత కష్టం దేనికి? ఒకసారి ఆయనను తీసుకురాయ్యా!'' అన్నారు. మరొకసారి ఆయనే, ''ఆయన చాలా గొప్పవాడయ్యా. ఆయన కొబ్బరికాయలు నాకు (నైవేద్యంగా) పంపడమేమిటి? నేనే ఆయనకు పంపాలనుకుంటున్నాను'' అన్నారు.

అలాగే గుంటూరులో వున్న రామభక్తాగ్రేసరులైన శ్రీ రంగన్నబాబు దర్శనార్థం పూజ్యశ్రీ మాస్టరుగారు వెళ్తూండేవారు. వారికి శ్రీ రాముని నిత్యసాక్షాత్కారం వుండేది. ఆయన పూజ్యశ్రీ మాస్టరుగారిని ఎంతో ప్రేమతో ఆదరించేవారు. ఎప్పుడు వెళ్ళినా ఆయనను తనవెంట భక్తుల ఇండ్లకు తీసుకువెళ్ళి వారికి ఆయనగూర్చి ఎంతో గొప్పగా పరిచయం చేస్తుండేవారు. పూజ్యశ్రీ

మాస్టరుగారికి యివ్వమని శ్రీరాములవారు యిచ్చిన ఎన్నో ప్రసాదాలను శ్రీ రంగన్నబాబుగారు ఆయనకు యిస్తుండేవారు. శ్రీ రంగన్నబాబుగారు ఆయన గురించి అందరికీ యిలా చెబుతుండేవారు, '' భరద్వాజకేమయ్యా! మహారాజు! ఆయనకు నా నమస్కారాలు చెప్పండయ్యా!'' ఒక్కొక్కసారి ఆయన, ''భరద్వాజ ఎంతో గొప్పవారు. ఆయనంతటివారమా అయ్యా మనము?'' అంటూండేవారు.

అలాగే తణుకు సమీపంలోని చివటం అనే గ్రామంలో వున్న దిగంబరియైన అమ్మను దర్శించారు పూజ్యశ్రీ మాస్టరుగారు. ప్రధమంగా అమ్మ దర్శనానికి వెళ్తున్న పూజ్యశ్రీ మాస్టరుగారికి ఊరి వెలుపలనే చివటం అమ్మ ఎదురైనారు. ఆయనను చూస్తూనే అమ్మ సాష్టాంగ నమస్కారం చేసారు! ఆమె పూజ్యశ్రీ మాస్టరుగారిని ఎంతో వాత్సల్యంతో చూసేవారు. ఆమె అంటూండేవారు: ''బాబు ఎంత గొప్పవాడే! ఎంత కష్టపడి పెద్దబాబు(సాయిబాబా) చరిత్ర వ్రాశాడే! లోకం కోసం ఎంత కష్టపడుతున్నాడే!'' అని.

శ్రీ అఖండానంద సరస్వతి భాగవత పారాయణ ద్వారా భగవత్సాక్షాత్కారం పొందిన మహనీయులు. ఆయన పూజ్యశ్రీ మాస్టరుగారిని

చూసి, ఆయన ప్రజల యొక్క శాంతియుత జీవనానికై పడుతున్న శ్రమకు చాలా ఆనందించారు. ఎంతో వాత్సల్యంతో ఆయన, ''బహుత్ మీఠా'' అంటూ పూజ్యశ్రీ మాస్టరుగారిని దగ్గరకు తీసుకున్నారు.

మాతా ఆనందమాయి దర్శనార్థమై పూజ్యశ్రీ మాస్టరుగారు వెళ్ళినపుడు ఆయనను అమ్మ ఎంతగానో ఆదరించారు. ముందుగా చెప్పి రాకపోయినా ఆశ్రమవాసులకు చెప్పి ఆయనకు ప్రత్యేకంగా భోజన వసతులు కల్పించారు. నీకేమీ కావాలో కోరుకోమని అడిగి, ఆయన కోరుకున్న విధంగా మరి రెండుసార్లు తమ దర్శనమనుగ్రహించారు.

శ్రీ వాసుదేవానంద స్వామి శిష్యులైన శ్రీ గుళవణి మహరాజ్ గారి దర్శనానికై వెళ్ళినపుడు ఆయన పూజ్యశ్రీ మాస్టరుగారిని 'సాయిబాబా కా బేటా' గా ప్రశంసించారు. అంతేగాక ఆయనకు శ్రీ గురుచరిత్ర సంస్కృత గ్రంథాలను ప్రసాదించారు. వాటినే తెలుగులోకి తర్జుమా చేసి పూజ్యశ్రీ మాస్టరుగారు గురు ప్రాశస్త్యాన్ని ఆంధ్రదేశానికి తెలియజేసారు.

శ్రీ కాళహస్తిలోని అవధూత గోపాల్ బాబా

పూజ్యశ్రీ మాస్టరుగారి గురించి ''భగవాన్ కి సమాన్ హై భరద్వాజ్'' అన్నారు.

దత్తోపాసకులగు శ్రీ తాడేపల్లి రాఘవనారాయణ శాస్త్రిగారు పరమ నిష్ఠాగరిష్ఠులైనప్పటికీ కులమత భేధాలను పాటించని పూజ్యశ్రీ మాస్టరుగారి గృహానికి విచ్చేసేవారు. వారి ఆశీస్సులు కోరిన పూజ్యశ్రీ మాస్టరుగారితో ఆయన, ''నీకు ఆశీస్సులివ్వగలవారెవ్వరు?'' అన్నారు.

శ్రీ సుధీంద్ర బాబుగారు అనే మహాత్ములు పూజ్యశ్రీ మాస్టరుగారిని గూర్చి, '' ఆయన ఆచార్య పదవికి అర్హులు. ఈ కాలానికి ఎదురీదుతున్నారు'' అన్నారు.

శ్రీ పాకలపాటి గురువుగారు, ''నాకు శ్రీ భరద్వాజ శంఖుచక్రాలతో దర్శనమిచ్చాడు. అతనిని చూడాలని చాలా బలంగా అనిపిస్తున్నది. అతనిని వెంటనే నా వద్దకు రమ్మని చెప్పండి'' అని పూజ్యశ్రీ మాస్టరుగారి పితృదేవులైన శ్రీమాన్ అనంతాచార్యులుగారితో అన్నారు.

శిరిడీలో నివసించిన శివనేశన్ స్వామి, ''భరద్వాజ గొప్పతనం ఎంతటిదో ఎవరికీ అర్థంగాదు. అతడు నివురుగప్పిన నిప్ప. తన సంగతి బయటపడనివ్వడు. అందుకే అతనిని అపార్థం

చేసుకోవడానికి అవకాశం ఎక్కువ వుంటుంది. అందరిలో బాబాను దర్శించమని చెప్పిన ఆయనలోనే దోషాలెంచితే ఎలా?'' అనేవారు.

శ్రీ రామసూరత్ కుమార్ గారు,(''Bharadwaja *is* Bharadwaja'') ''భరద్వాజ అంటే భరద్వాజే'' అన్నారు. అంటే మాస్టర్‌గారితో మరెవ్వరూ సమానులు కారన్నమాట!

శ్రీ రాఖాడీ బాబా, ''నువ్వు ఎక్కడ నమస్కారం పెడితే అక్కడ సాయినాథుని పాదాలుంటాయి. నీ గురువు యొక్క ఆశీస్సులు పుష్కలంగా వున్నాయి. అందుకే అనసూయా మాత అనుగ్రహం నీకు లభించింది'' అన్నారు.

ఇలాగే ఇంకా ఎందరో మహాత్ములు పూజ్యశ్రీ మాస్టరుగారిని ఎంతగానో ప్రశంసించారు. తమ సంపూర్ణ ఆశీస్సులను అందించారు. ఆయనను చూస్తుంటే ఆయా మహాత్ముల నేత్రాలలో ఒక ప్రయోజకుడైన పుత్రుని, తాము చెప్పినది తూ.చ. తప్పకుండా ఆచరించే శిష్యుని, ఒక ధర్మ ప్రవర్తకుని, ప్రపంచ శ్రేయస్సుకోసం నిరంతరం శ్రమపడే ఒక ఔన్నత్యుని ఒక అత్యద్భుత ఆధ్యాత్మిక జ్యోతిని చూసిన ఆనందం తొణికిసలాడేది. అవధూతయైన చివటం అమ్మ పూజ్యశ్రీ మాస్టరుగారు వస్తున్నారంటే ''బాబు

వస్తున్నాడే'' అంటూ ఒక పండుగలాగా చేసేవారు.

శ్రీ చీరాలస్వామి ప్రియ పుత్రుని చూస్తున్న తండ్రిలాగా 'ఆ ఎర్రస్వామి ఎప్పుడొస్తాడయ్యా?' అంటూ పూజ్యశ్రీ మాస్టరుగారి కోసం ఎదురుచూసేవారు. తమ క్రిందటి జన్మ రహస్యాన్ని పూజ్యశ్రీ మాస్టరుగారికి మాత్రమే చెప్పారు. విద్యానగర్‌లోవున్న పూజ్య శ్రీ మాస్టరుగారికి తాము నిర్యాణం చెందబోతున్నామని తమ దివ్య సంకేతంతో తెలియజేశారు. ఆ సంకేతాన్ననుసరించి మాస్టర్‌గారు వెంటనే చీరాల చేరుకున్నారు. శ్రీ చీరాల స్వామి ఎంతో ఆప్యాయతతో మాస్టర్‌గారి చేయి తమ హృదయంపై వుంచుకున్నారు. అలా మాస్టర్‌గారు తమ చెంతకు చేరేవరకు వేచివుండి తర్వాతనే సమాధి చెందారు.

జిల్లెళ్ళమూడి అమ్మ ఎటువంటి సమయాలలోనైనా పూజ్యశ్రీ మాస్టరుగారిని తమ దర్శనం చేసుకోవడానికి రావచ్చని చెప్పేవారు.

ఇంకా ఎంతోమంది మహాత్ములు, అవధూతలు, సిద్ధులు - ఆయనను ఎంతగానో ప్రశంసించారు. అయినప్పటికీ ఆయన తాము గురువునని అహంకరించలేదు, శిష్యుడనని విఱ్ఱవీగలేదు. ''నేనూ మీలాంటివాడినే. ఇందులో

నా గొప్పతనమేమిలేదు''. అని నిగర్వంగా చెప్పకుంటూ, అతి నిరాడంబరంగా వుంటూ, సామాన్యమానవునిలా ప్రవర్తించిన ఆయన ఎవరు? - ఇంకెవరు? మనందరికీ ప్రియాతిప్రియమైన ''శ్రీ సాయిబాబా కా బేటా!'' (''శ్రీ సాయిబాబా ముద్దు బిడ్డడు'') పూజ్యశ్రీ ఆచార్య ఎక్కిరాల భరద్వాజ గారు.

అటువంటి పూజ్యశ్రీ మాస్టరుగారి 75వ జన్మదిన సందర్భంగా ఆయన పాదపద్మాలకు అనంతకోటి ప్రణామములు! కృతజ్ఞతాపూర్వక నమస్సుమాంజలులు!

**జై సాయి మాస్టర్!**

**జై సాయి మాస్టర్!**

''సద్గురువు' అన్న పదం గుర్తుకు రాగానే సాయియే మనస్సుకు స్ఫురిస్తారు'' అని హేమాద్పంతు అంటాడు.

పూజ్యశ్రీ మాస్టరుగారిని చూసినవారికి, ఆయనతో సాన్నిహిత్యం వున్నవారికీ గూడ అలాగే అనిపిస్తుంది.

T.T.D సంస్థలో కార్యకర్తగా పనిచేస్తున్న జి. నాగేశ్వరరావు యిలా అంటారు: ''పూజ్యశ్రీ మాస్టరుగారి దగ్గరకు ఎవరైనా వెళ్ళవచ్చు. ఆయన దగ్గరకు వెళ్ళడానికి ఏమైనా తీసుకువెళ్ళడము లాంటి ఫార్మాలిటీస్ ఏమీ వుండేవి గావు. ఎవరుపడితే వారు ఎక్కడంటే అక్కడ ఆయనను కలవవచ్చు. ఎవరైనా సరే వారు అడిగిన ప్రశ్నకు వారి స్థాయి నుంచి సునిశితంగా, సుకుమారంగా, లాలిత్యంగా, అవసరమైతే కటువుగా సమాధానాలను శాస్త్రాలనుంచి కోట్ చేస్తూ గూడ చెప్పేవారు. ఎంతోమంది ఆయన దగ్గరకు సందేహ నివృత్తి కోసం వచ్చేవారు. అలా వచ్చినటువంటి వారి స్థాయి ఏమిటి? వారు పండితులా లేక పామరులా, వున్నవారా, లేనివారా? అన్న భేదం

చూపక ఎవరొచ్చి ఎలాంటివి అడిగినా గూడ వారికి విషయాన్ని సమగ్రంగా అవగాహనకు తీసుకువచ్చి వారిలో ఒక ఎన్‌లైటెన్‌మెంట్ తీసుకువచ్చేవారు. 'విషయం ఇది బాబు! ఇలా ఆలోచించాలి' అని చెప్పగలిగే సాంప్రదాయాన్ని నాకు తెలిసినంతవరకూ మాస్టారిలా ప్రచారం చేసినవారూ, అట్టి పద్ధతిని ప్రవేశపెట్టినవారూ, ఆ పద్ధతిని పరిచయం చేసినవారూ లేరు.

ఎవరన్నా ఆయన దగ్గరకు వచ్చినపుడు ముందు అవతలివారికి ఏమి తెలుసో, అతనికి ఆ విషయంలో ఎంత పరిజ్ఞానం వుందో తెలుసుకునేవారు. ఆ వచ్చినవారు ప్రయత్నం చేసి భయంచేత చెప్పలేకపోయేవారు. ఆ విషయంలో వారేమనుకుంటున్నారో కొన్ని ప్రశ్నలు వేసేవారు. ముందు బెరుకుగా వున్నా ఆయన చూపించే ఆప్యాయత వల్ల, అందించే ప్రోత్సాహం వల్ల ఆ తర్వాత వారికి మొహమాటము, భయము పోయి చాలా స్వేచ్ఛగా తనకేంకావాలో అది అడిగే చనువు, చొరవ వారికి లభించి తమకు కావలసినదానిని ఫ్రీగా చెప్పగలిగేవారు. అప్పడు మాస్టరుగారు వారి స్థాయి ఏమిటో తెలుసుకొని అక్కడనుంచే మొదలుపెట్టేవారు. ఏ స్థాయిలో చెబితే వారికి

అర్థమవుతుందో ఆ స్థాయిలో వారికి చెప్పేవారు. చిన్నపిల్లలైతే వారి స్థాయికి దిగి చెప్పేవారు. పెద్దవారైతే వారి స్థాయికి ఎదిగి చెప్పేవారు. ఇది అయనలోని మరో ప్రత్యేకత. కానీ అసలు మాస్టారి స్థాయి ఎమిటో ఎవరికీ అంతుపట్టేది కాదు. జ్ఞానం కావాలనుకున్నవారికి జ్ఞానపరంగా చెప్పేవారు. భక్తులకు భక్తి ఎలా స్థిరపరచుకోవాలో - చెప్పేవారు. కర్మిష్ఠికి కర్మ ఎలా చేయాలో, అనుభవించాలో చెప్పేవారు. వైరాగ్యం అంటే ఏమిటో తెలుసుకోగోరేవారికి దానిని విశదీకరించేవారు. విజ్ఞానపరంగా భగవంతుని గూర్చి చెప్పమని కోరేవారికి విజ్ఞానపరంగా భగవంతుని ఆస్తిక్యాన్ని ఎలా ఋజువుపరచవచ్చో తెలియజేసేవారు. అలా ఎవరికి ఏది కావాలో దానిని వారికి అందించారు. అందుకే, 'ఓహో! సద్గురువంటే యిలా వుంటారు!' అనిపించేది''.

చిన్నప్పటినుంచి పూజ్యశ్రీ మాస్టరుగారి వద్దకు వస్తూవున్న పి. శ్యాంప్రసాద్ ఒకసారి పుస్తకంలో చదివి ప్రాణాయామం చేయడం ప్రారంభించాడు. ఒకరోజు పూజ్యశ్రీ మాస్టరుగారు అతనిని, ''ప్రాణాయామం చేస్తున్నావా ఏమిటి?'' అని అడిగారు. అందుకతడు చేస్తున్నానని చెప్పగానే,

''పుస్తకాలు చదివి ప్రాణాయామం చేయగూడదు. తెలిసినవారి దగ్గర అభ్యసించి చేయాలి. లేకపోతే సరిగా చేయడం చేతగాకపోతేను, ఆహారనియమాలు పాటించకపోతేను, మధ్య మధ్యలో అవాంతరాలకు విరుగుడు తెలియక తికమకపడి ఆరోగ్యం దెబ్బతినే ప్రమాదం వుంటుంది. ఒక్కొక్కసారి పిచ్చిపట్టవచ్చు గూడా'' అని చెప్పారు. అయితే నన్నేం చేయమంటారో మీరే చెప్పండి అని అడిగితే 'సోహం' చేయమని దానిని ఎలా చేయాలో వివరించి చెప్పారు.

అతడలా చేయడానికి వెంటనే ప్రయత్నించాడు. కానీ అతనికి ఆ సాధన చేయడం కష్టమైంది. కొంతసేపు ప్రయత్నించి విసుగుపుట్టి తన ఊరు మెట్టు గ్రామానికి వెళ్ళాడు. ఇంటికి వెళ్ళాక ఆ రాత్రి పడుకోగానే అతనికి, 'సోఽహం' అనే శబ్దం వినిపించింది. అతడు దానిని గమనించగా తన శ్వాసలోనుంచే పూజ్యశ్రీ మాస్టరుగారు చెప్పినట్లు 'సోఽహం' అప్రయత్నంగా జరుగుతున్నది! అతడు దానిని గమనిస్తూ, వింటూనే నిద్రపోయాడు. మధ్యలో మెలకువ వచ్చింది. అలాగే ఆ సాధన కొనసాగుతున్నది. అతనికి భయమేసి ఉదయమే విద్యానగర్ వెళ్ళి పూజ్యశ్రీ మాస్టరుగారిని

దర్శించుకుని నమస్కరించి రాత్రి నుంచి తనకు జరుగుతున్న అనుభవం గురించి చెప్పాడు. తనకు చాలా భయమేస్తున్నదని గూడ చెప్పాడు. 'ఓహో! అలాగా!' అంటునే పూజ్యశ్రీ మాస్టరుగారు కాలేజీకి బయలుదేరారు. అతనిని గూడ తమ వెంటరమ్మని త్రోవలో వాళ్ళ ఇంట్లోవాళ్ళ సమాచారాలు, ఇతర విషయాలు అడిగి కాలేజీకి వెళ్ళారు. అతడు గూడ ఇంటికి బయలుదేరాడు. కొంతదూరమెళ్ళాక 'ఏమిటి? పూజ్యశ్రీ మాస్టరుగారు తానడిగిన విషయం ఏమీ చెప్పలేదు!' అనుకుంటూనే శ్వాస గమనించాడు. ఆశ్చర్యం! ఆ శబ్దం ఆగిపోయివుంది. అట్టి అద్భుత సాధనను అనుభవింపజేయడం, తిరిగి తీసుకొనడము సద్గురువుకే సాధ్యమని అతడు గ్రహించాడు.

ఒకతను దుర్భర పరిస్థితిని భరించలేక ఆత్మహత్య చేసుకోవాలని గట్టిగా నిర్ణయించుకుని పూజ్యశ్రీ మాస్టరుగారి వద్దకు వచ్చాడు. కానీ అతడేమీ ఆయనకు చెప్పలేదు. అతడు కూర్చున్న కాసేపు తర్వాత పూజ్యశ్రీ మాస్టరుగారు వున్నట్లుండి ధ్యానస్థులైనారు. కాసేపయిన తర్వాత అతనికేసి చూసారు. అప్పడు ఆయన కళ్ళల్లోనుంచి ఏదో శక్తి ఇతనిలోకి ప్రవహించినట్లయింది. ఇంతలో ఆయన, "

మనిషి చచ్చిపోవాలనుకోవడమేమిటి? చనిపోయే బదులు జీవితాన్ని మానవసేవకు అంకితం చెస్తే సరిపోతుంది గదా! లేక భగవచ్చింతనలో గడిపితే సరిపోతుంది గదా!'' అన్నారు. ఆ మాటలతో అతని మనస్సులో చనిపోదామన్న తలంపు నశించింది.

మరొకసారి అతనికే ధ్యానం ఎంత ప్రయత్నించినా కుదరడం లేదు. ఆ విషయం అతడు పూజ్యశ్రీ మాస్టరుగారికి చెప్పలేదు. అతడు ఆయనకు పాదనమస్కారం చేసుకుంటుంటే ఆయన అతని వెన్ను నిమిరి, అతని తలపై తమ అమృతహస్తముంచారు. అప్పటినుంచీ అతనికి ధ్యానంలో ఏకాగ్రత కుదిరింది.

తన శ్వాసను బట్టీ ప్రశ్నలు చెప్పే ఒక వ్యక్తి పూజ్యశ్రీ మాస్టరుగారి దగ్గరకు వచ్చాడు. ఆయన సన్నిధిలో కొద్దిసేపు కూర్చున్న తర్వాత అతనన్నాడు: ''మీ సన్నిధిలో ఇడ-పింగళ నాడులన్నీ సక్రమంగా పనిచేస్తున్నాయి సార్! నేను ఉదయం నుంచీ అవి సమానంగా పనిచేయక తంటాలు పడుతున్నాను. కానీ మీ సన్నిధిలో వాటంతట అవే పనిచేస్తాయి''. సద్గురు సన్నిధిలో మాత్రమే అలాంటి అనుభవాలు కలుగుతాయని పెద్దలు చెబుతారు.

జి. వి. రమణయ్యకు ఒకనాడు స్వప్నంలో

పూజ్యశ్రీ మాస్టరుగారు ఒక చోట ధ్యానస్థులై కూర్చుని కనిపించారు. కొంతసేపటికి ఆయన కూర్చున్నట్లే ఆకాశంలోకి పైకి వెళ్ళసాగారు. అప్పుడతడు ఆయన పాదాలను గట్టిగా పట్టుకున్నాడు. అలా ఇద్దరూ ఆకాశంలో ప్రయాణిస్తూ మహానంది, ఆహోబిలము చూసారు. తర్వాత అవధూతయైన రామిరెడ్డి తాత కల్లూరి గ్రామము, మూడవది మహావృక్షాలతో నిండివున్న ఎత్తైన పర్వతప్రాంతము. స్వప్నంలో త్రిస్థలీ యాత్రను పూజ్యశ్రీ మాస్టరుగారు అతని చేత చేయించారు. అది సద్గురువులకు మాత్రమే సాధ్యం.

పూజ్యశ్రీ మాస్టరుగారు చేసిన లీలలు ఎన్నో.. ఎన్నెన్నో...

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

ఉపాధ్యాయ వృత్తి ఎంతో శ్రేష్టమైనది. కారణం విద్యార్ధులకు సత్యాన్ని బోధించడానికి, తద్వారా తరతరాలను తీర్చిదిద్దడానికీ, అవకాశముంటుంది. అందుకనే ఆ వృత్తినే ఎన్నుకున్నారు పూజ్యశ్రీ మాస్టరుగారు.

ఆయన వద్ద విద్యనభ్యసించిన విద్యార్థులెందరో ఆయనకు శిష్యులైనారు. అలాగాక ఆయనతో విద్యవరకే సంబంధమున్నవారు గూడ ఆయన బోధించిన విషయాలను, ఆయననూ ఎన్నడూ మర్చిపోలేరు. అట్టి విశిష్ఠబోధన ఆయనది!

ఆధ్యాత్మికతనే ఆయన ప్రధానంగా భావించినప్పటికీ తరగతిలో మాత్రం ఆధ్యాత్మికత గూర్చిగాని, మహాత్ముల గూర్చి గానీ ఎన్నడూ మాట్లాడేవారు గాదు. ఎవరైనా విద్యార్థి అటువంటి విషయాల ప్రసక్తి తెచ్చినా ఆయన ఒప్పకునేవారు గాదు. కాలేజీ సమయం కానప్పడు మాత్రమే, బయట మాత్రమే ఆధ్యాత్మికత గురించి మాట్లాడేవారు. పాఠ్యాంశాలను చక్కగా వివరించి చెప్పేవారు. అర్ధమవకపోతే మళ్ళీ మళ్ళీ అడగమని, ఎన్ని సార్లయినా వారి సందేహాలు తీరుస్తామనీ

అనేవారు.

ఆయన బోధించే తరగతి ఎంతో ప్రశాంతంగా వుండేది. విద్యార్థులు ఆయన తరగతిలో నిశ్శబ్దంగాను, ఉత్సాహంగానూ వుండేవాళ్ళు. ఒక విజ్ఞానవేత్త, సంఘసంస్కర్త, మహాత్ముడు ఆయిన వారి బోధ - అది ఏ విషయమైనా గావచ్చు, అద్భుతంగానే వుంటుంది.

ఆయన తమ హృదయపులోతులలోంచి బోధిస్తారు - పెదవి చివరినుంచి కాదు, తమ హృదయంనుంచి విద్యార్థుల హృదయపులోతులలోకి అందిస్తారు. చెవుల అంచులకు కాదు. అందుకనే ఆయన బోధ వారి హృదయాలకు అంతగా హత్తుకుంటుంది.

ఆయన బోధనాదక్షత చూసి సాయంత్రం ట్యూషన్ చెప్పమని ఎందరో విద్యార్థులు అడిగేవారు. అందుకాయన యిలా సమాధానం చెప్పేవారు: ‘‘నేను బోధించడానికి కాలేజీవాళ్ళు జీతం యిస్తున్నారు. కనుక నేను విడిగా బోధించి డబ్బులు తీసుకోవడం అధర్మమవుతుంది. కనుక మీరు నా గదికి వస్తే ఉచితంగానే మీకు పాఠాలు చెబుతాను’’. ఆయన చెప్పిన నోట్సులను వీరి విద్యార్థుల ద్వారా ఇతర కాలేజీలలో చదువుతున్నవారు ఎందరో

తీసుకుని వెళ్ళేవారు. అంత చక్కగా వివరిస్తూ ఆయన చెప్పేవారు.

అందుకే శ్రీ సాయిబాబా గూర్చి పుస్తకాలు వ్రాసి పైకమార్జిస్తున్నారని అనేవారికి ఆయన, ''నేను డబ్బు సంపాదించుకోవాలనుకుంటే సాయిబాబా మీదే పుస్తకాలు వ్రాయవలసిన అవసరం లేదు. నేను గైడ్స్ వ్రాస్తే ఇతరులు వ్రాసిన వెవ్వరూ కొననంత బాగా వ్రాయగలను. కానీ నా మార్గమది కాదు. నా సంగతి నాకు తెలుసు గనుక ఎన్ని విమర్శలు వచ్చినా లెక్క చెయ్యను. నా పని నేను చేసుకుపోతూంటాను'' అని సమాధానమిచ్చేవారు.

తరగతిగదిలో ఆయన అప్పుడప్పుడు విద్యార్థులతో హాస్యసంభాషణ చేస్తూ సరదాగా వుండేవారు. వాళ్ళు ఏమైనా విమర్శ చేస్తూ గుసగుసలాడుకుంటుంటే ఆయన, ''మీరు మాట్లాడుకునేదేదో మాకూ చెబితే మేమూ నవ్వుకుంటాము గదా!'' అని నవ్వుతూ అనేవారు.

ఆయన దగ్గర చదువుతున్న విద్యార్థులిలా అంటారు: ''పూజ్యశ్రీ మాస్టరుగారు బోధించే విధానం అద్భుతంగా వుండేది. షెల్లీ వ్రాసిన 'స్కైలార్క్' పాఠం చెప్పేటప్పుడు ఆయన ఆధ్యాత్మికతను జోడించేవారు. ఆత్మతత్త్వాన్ని షెల్లీ భావనతో పోల్చి

చెబుతుంటే మేము తన్మయులమై వినేవాళ్ళము. ఒక దృశ్యకావ్యాన్ని చూస్తున్న అనుభూతి మాకు కలిగేది. షేక్స్పియర్ వ్రాసిన ''క్లియోపాత్ర'' డ్రామాను అభినయిస్తూ చెప్పేవారు. అప్పుడాయన పాత్రలలో లీనమైనట్లు గొంతు మార్చి చెబుతుండేవారు. ఆయన క్లాసంటే విద్యార్థులందరికీ చాలా ఇష్టం. ఎవరి క్లాసులకూ అంత ఇష్టంగా వెళ్ళేవాళ్ళముగాదు. వందశాతం హాజరు ఆయన క్లాసులో వుండేది. విద్యార్థులందరూ ఆయన క్లాసుకోసం ఎదురుచూసేవాళ్ళు''.

అంతేగాదు, పూజ్యశ్రీ మాస్టరుగారు చి॥లు వేదవతి, ద్వారకనాథ్‌కు పాఠాలు చెప్పే విధానం ఎంతో బాగుండేది. ఏ శాస్త్రం చెబుతుంటే అందులోని సూక్ష్మాలు, పూర్వాపరాలు వాళ్ళకు అర్థమయ్యే విధంగా చెప్పేవారు. ఉదాహరణకు విజ్ఞానశాస్త్రములోని భూమి, నక్షత్రములు, సూర్యుడు మొ॥న వాటి గూర్చి చెప్పేటప్పుడు అవి ఎలా సృష్టించబడ్డాయో, ఒకదానినొకటి ఆకర్షిస్తూ ఎలా తిరుగుతూ వుంటాయో, సూర్యుడు, చంద్రుడు, భూమి - ఈ మూడు మన దిన చక్రానికి సంబంధించి ఎలా వుంటాయో చెప్పేవారు. వాళ్ళకు బాగా అర్థమయ్యేందుకు ఆ మూడింటికీ మూడు

బంతులుగాని, నిమ్మకాయలాంటి కాయలను గాని ఉపయోగించి భూమి తన చుట్టూ తాను తిరుగుతూ, సూర్యునిచుట్టూ ఎలా తిరుగుతుందో, చంద్రుడు ఎలా వుంటాడో చూపించేవారు.

అలాగే చరిత్ర గురించి చెప్పేటప్పుడు రాజులు, రాజ్యాలపాలన, వాటికోసం పోరాటాలు వివరిస్తూ యుద్ధాల వల్ల జరిగిన నష్టమేమిటి? లాభమేమిటి? అసలు రాజ్యాన్ని ఎవరైనా ఎలా పరిపాలించాలి అని చెబుతూ ఉదాహరణగా ఇల్లే ఒక రాజ్యమైతే చుట్టు ప్రక్కల ఇళ్ళు మరో రాజ్యాలైతే ఎలా వుంటుందో, అప్పుడెలా ఉంటే ఏమి జరుగుతుందో వివరించేవారు.

అలాగే ఒకరోజు తెలుగు పుస్తకంలోని 'పులి - ఆవు' కథను చి॥ వేదవతికి చెబుతున్నారు. అందులో ఒక పులి ఒక ఆవుపైబడి చంపబోతుంటే ఆవు తనకు రోజుల పసిబిడ్డ వున్నదని, దానిని ఒక్కసారి చూసి, పాలిచ్చి, సాటివారికి అప్పజెప్పి తప్పక వస్తానని, తన మాట నమ్మమనీ ప్రార్థిస్తుంది. పులి జాలి పడి అందుకు అంగీకరిస్తుంది. ఆపుడా ఆవు పరుగు పరుగున తన బిడ్డ దగ్గరకు వచ్చి, కడుపునిండా పాలిచ్చి, దానికి ఎలా మెలగాలో సుద్దులు చెప్పి, సాటి ఆవులకు తన బిడ్డను చూసుకోమని అప్పగించి పులి

దగ్గరకు బయలుదేరుతుంది. ఇంతవరకూ చెప్పడం వచ్చేసరికి చాలా సున్నిత స్వభావంగల వేదవతి వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది. అప్పుడు పూజ్యశ్రీ మాస్టర్‌గారు కథ చెప్పడం ఆపి, ''ఎందుకమ్మా ఏడుస్తావు? ఏం జరుగుతుందో చూడు. ఆ ఆవు పులి చేతికి చిక్కినప్పుడే చనిపోవలసింది. కానీ అది ధర్మాత్మురాలు. అందుకని తాను ఇచ్చిన మాటను తప్పలేదు. సత్యాన్ని అంటిపెట్టుకుంటే ఏం జరుగుతుందో చూడు! అది రక్షింపబడుతుంది. పూర్తిగావిను'' అంటూ మిగతా కథ చదవడం ప్రారంభించారు. దాని సత్యవాక్యపాలన చూసిన పులి హృదయం గూడ కరిగిపోయింది. దానిని చంపకుండా పంపివేస్తుంది. ఈ కథచెప్పి మాస్టర్‌గారిలా అన్నారు: ''ధర్మమనేది అంత గొప్పదన్నమాట. ఎవరైతే ధర్మానికి అంటిపెట్టుకుని వుంటారో, వాళ్ళని ఆ ధర్మమే రక్షిస్తుంది''.

అలాగే ద్వారకనాథ్‌కు ఒకసారి వర్షాలు పడడం గురించి చెబుతూ ఎండ, వాన, చలి కాలాలు ఎలా సంభవించేది, ఎండ వల్ల నీరు ఆవిరియై మేఘాలుగా ఏర్పడి తర్వాత వర్ష రూపంలో తిరిగి భూమికి ఎలా చేరుకునేది వివరించి చెప్పారు. కాలచక్రం ఎందుకు అలా కొనసాగుతుందో

చెప్పారు. అలాగే మొక్కల గురించి చెప్పడానికి ఆయన వాళ్ళకు పెరట్లోకి తీసుకువెళ్ళి చిన్నచిన్న మొక్కలను చూపిస్తూ అవి ఎలా మొలకెత్తుతాయో, వేటివల్ల ఎలా వృద్ధి చెందుతాయో వ్రేళ్ళు, కాండము, కొమ్మలు, ఆకులు, పూలు, పండ్లు ఎలా వస్తాయో వివరించేవారు. ''మట్టి, గాలి, నీరు,ఎండ కలిసి చెట్టు ఎలా అవుతోంది?'' అని ప్రశ్నించి ఆలోచించనిచ్చేవారు. అలా ఆలోచనా శక్తి పెంచేదిగా వుండేది ఆయన విధానం.

'' ఉపాధ్యాయుడు పాఠ్యాంశాలను పరీక్షల కొరకు మాత్రమే బోధిస్తే చాలదు. వాళ్ళను ఋజుమార్గ ప్రవర్తకులుగా తీర్చిదిద్దాలి. పసి బిడ్డలపై తల్లి బాధ్యత ఎంతటిదో, విద్యార్థులపై ఉపాధ్యాయుల బాధ్యత అత్యంత విశిష్టమైనది. వారికి పాఠ్యాంశాలనే గాక నైతిక విలువలను బోధించవలసిన ఆవశ్యకత వున్నది. విద్యార్థులలో నైతికత లోపిస్తే సమాజం దుర్భర పరిస్థితిని ఎదుర్కోవలసి వస్తుంది.అందుకని ప్రాథమిక విద్యనుండి విశ్వవిద్యాలయ విద్య వరకూ ధర్మ సూత్రాలను, నైతిక విలువలను, సమాజంలో విద్యార్థుల బాధ్యతను వివరించడానికి ప్రతిరోజు నైతిక తరగతులను విధిగా ప్రవేశపెట్టాలి. అప్పడే పతనమైన మన ధర్మ వ్యవస్థ తిరిగి

పుంజుకుంటుంది'' అని ఆయన చెప్పేవారు.

ఆయన తమ తోటివారికీ, విద్యార్థులకు కేవలం పాఠశాల విద్యలనే కాక జీవితానికి ఆవశ్యకమైన అనేక విద్యలను మరెవ్వరూ నేర్పలేనంతగా నేర్పేవారు. ఈత, యోగాసనాలు, వక్తృత్వం మొదలుకొని వ్యవసాయం, వంట విషయాలను సైతం బోధిస్తూ వాటిలోని సూక్ష్మాలను, మెలకువలనూ తెలియజెప్పేవారు. నిజానికి వారి ప్రతి చర్య విద్యా బోధనే.

వాచా చెప్పడమే గాదు, విద్యార్థులకు ఆచరణా పూర్వకంగా బోధించేవారు. అందుకే ఆయన సాటిలేని విద్యా ప్రదాత. వారి బోధనలో తమ ఆలోచనలు అవతలవారిపై రుద్దడం వుండేదికాదు. అవతలివారిని ఆలోచింపచేసి వారి ఆలోచనా విధానాన్ని సరిచేసే విధంగా వుండేది. అలా ఆయన బోధనాదక్షత సాటిలేనిది.

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

పూజ్యశ్రీ మాస్టరుగారి దగ్గరకు ఎందరో వచ్చి ఎన్నో విషయాలు మాట్లాడేవారు. ఆయన వారివారికి తగిన సలహాలు, సమాధానాలు యిస్తూ, ఆయా విషయాల పట్ల వారి అవగాహనను పెంపొందించేవారు. అవసరమైతే సరిదిద్దేవారు. ఏ విషయంలోనైనా వారి బోధనాదక్షత విశిష్ఠమైనది.

ఒకరోజు రమాకాంత్ అనునతడు పూజ్యశ్రీ మాస్టరుగారిని తన స్కూటర్ వెనుక కూర్చోబెట్టుకొని ఒకచోట జరిగే సత్సంగానికి తీసుకువెళ్తున్నాడు. అప్పుడతడు పూజ్యశ్రీ మాస్టరుగారితో, "మాస్టరుగారూ! ప్రపంచంలోని వ్యక్తులందరి పట్ల వీరు మిత్రులు అనో, వీరు శత్రువులు అనో, భంధువులనో, పరాయివాళ్ళు అనో - ఇలా అనేక రకాలైన భావనలు కలుగుతాయి గాని వారిని బాబా స్వరూపులుగా చూడడం ఎలా సాధ్యం? " అని అడిగాడు. అప్పుడు పూజ్యశ్రీ మాస్టరుగారు,"చూడు రమాకాంత్! నీ వెనుక కూర్చుని వున్న నన్ను నువ్వు చూడడం లేదు. కానీ నీ వెనుక కూర్చుని వున్నది నేనని నీ ధ్యాసంతా నా మీదే వున్నది. కుదుపులు రాకుండా జాగ్రత్తగా నడపాలని ఆలోచిస్తూ

జాగ్రత్తగా నడుపుతున్నావు. నువ్వు రోడ్డుమీద ఇతర వాహనాలను చూస్తున్నావు, వాటిని జాగ్రత్తగా తప్పకుంటున్నావు. ఎవరైనా పలుకరిస్తే మాట్లాడుతున్నావు. కానీ నేను నీవెనుక కూర్చున్నాననే గుర్తింపు నీ మనస్సులో వుంటూనేవున్నది. అలాగే వ్యక్తులతో మాట్లాడుతున్నప్పటికీ వారిలో గూడ బాబానే వున్నారని, వారు బాబా స్వరూపులనీ గుర్తుపెట్టుకోవడం ప్రారంభిస్తే అభ్యాసం మీద సాధ్యమౌతుంది'' అన్నారు.

పూజ్యశ్రీ మాస్టరుగారి వద్దకు ఒకరోజు ఒక యువకుడు వచ్చి కూర్చుని, తనకు ఎక్కడో ఒకచోట ఒక గుహలో కూర్చుని తపస్సు చేసుకోవాలని వుందని చెప్పాడు. అప్పడాయన అతనితో,'' నువ్వసలు తపస్సు చేయాలని ఎందుకనుకుంటున్నావు?'' అనడిగారు. అప్పుడతను, '' ఎందుకేమిటి సార్! భగవంతుని ప్రత్యక్షం చేసుకోవాలని'' అన్నాడు.

'' అయితే సన్యాసికి ఎదురయ్యే కష్టాలు గురించి ఆలోచించావా? శ్రీ సాయిబాబా చరిత్రలో ఒకడు ఆ కష్టాలు, ఇబ్బందులు గురించి తెలుసుకుని హరిద్వార్ వెళ్ళడం మానుకున్నాడు, అది చదివావా?''

'' చదివాను సార్! అవన్నీ ఇబ్బందులుగా

నాకేమీ అనిపించలేదు''

''భోజనం దొరకచ్చు, దొరకక పోవచ్చు గదా! ఆ సంగతి ఆలోచించావా?''

'' ఆఁ! భోజనం దొరికే చోటునే ఎన్నుకుని వుందామనుకుంటున్నాను ''

'' అంటే? ''

'' ఏదైనా ఊరికి దగ్గరగానో, లేకపోతే భోజనం దొరికే క్షేత్రాలు ''

'' ఇందాక గుహలో తపస్సు చేసుకోవాని వుందన్నావ్ మరి! ''

'' అలాగా గూడ అనిపిస్తున్నది సార్! ''

'' మరి గుహలో వుంటే ఆహారం ఎలా వస్తుంది?''

'' ఆలోచించలేదు సార్! ''

'' మరి పులులు, సింహాలు భయమో?! ''

'' అదీ ఆలోచించలేదు సార్! ''

'' సరే ! ఏదో ఒక ఊరికి దగ్గరగా పాడుబడ్డ దేవాలయంలోనో, ఎక్కడో ఒకచోట వుందామని అనుకున్నావనుకో! భిక్షచేసి భోజనం సంపాదిస్తావు. ఎట్టి సౌకర్యాలూ లేకుండా వుండగలవా? ఉదాహరణకు పడుకోడానికి పక్క, దిండు, చలికి తట్టుకోవడానికి దుప్పటి, రగ్గు, ఒళ్ళు రుద్దుకోవడానికి

సబ్బు, పళ్ళు తోముకోవడానికి పేస్టు, బ్రష్ - ఇంకా స్నానపానాదులకు అవసరమైన బక్కెట్టు, చెంబు, మంచి నీళ్ళు త్రాగడానికి గ్లాసు, కుండ, భిక్షపాత్ర.... ఇలా ఎన్నో -అన్నీ ఆలోచించావా?''

''అతడు తలగోక్కుంటూ, అవన్నీ ఆలోచించలేదు సార్! కానీ తీసుకువేళ్తే సరిపోతుంది గదా సార్! ''

'' మరి భిక్షకు వెళ్తే, వాళ్ళు పెట్టే భోజనం నీకిష్టమౌతుందా? ''

'' చాలా మంది ఇళ్ళకు వెళ్తాము గనుక రకరకాల వంటకాలు వస్తుంటాయి గదా! సన్యాసి వచ్చాడని పిండి వంటలు గూడ వేస్తుంటారు గదా! ఎందుకు బాగుండవు?''

'' ఓహో ! అదా నీ ధైర్యం? ఒకవేళ రాకపోతే ? వచ్చినా అవి నీకు సరిపడకపోతే! అప్పుడెలా ?''

'' రుచికరంగా పెట్టే ఇళ్ళు చూసుకుని వాళ్ళ ఇళ్ళకే వెళ్తే సరిపోలా ? ''

'' సరే! మరి నువ్వు యువకుడివి గదా! సహజంగా వచ్చే కోరికలు వస్తుంటాయా?''

'' ఆ ! వస్తుంటాయి - వాటిని నెట్టేస్తూ వుంటాను. మనకు కావలసింది భగవత్సాక్షాత్కారం గదా సార్! ''

" పూజశ్రీ మాస్టర్ గారు హాస్యంగా నవ్వుతూ,"ఏంటోయ్! మనకు అంటున్నావ్! నేనేమి సన్యసించలేదు.నేనుపెళ్ళి చేసుకున్నాను. మరి నీకు అంత వైరాగ్యమున్నదన్నమాట. అయితే ఇంత మంచి పాంటు, షర్టు ఎందుకు వేసుకున్నావు ? గడ్డం శుభ్రంగా షేవ్ చేసుకున్నావెందుకు ?"

" ఇవన్నీ ఇక్కడ సార్! ఆక్కడకి వాళ్ళాక అవన్నీ ఎలాగూ తప్పవు గదా!"

" అంటే అక్కడ కాషాయం ధరించి, జడలు, గడ్డము పెంచుకుంటావా! లేక తల గొరిగించుకుంటావా?"

" అసలలా వుండడం అవసరమా? మామూలు పంచె లేక లుంగీ, బనీను వేసుకుంటే చాలదా సార్! గడ్డము, జడలు వుంటే చికాకుగా వుండి తపస్సుకు అంతరాయం కలుగుతుంది గదా! అందుకని అవి వద్దనే అనుకుంటున్నాను సార్!"

ఆందుకు పూజశ్రీ మాస్టర్ గారికి అతని అమాయకత్వం చూసి నవ్వు వచ్చింది. ఆయన చిన్నగా నవ్వుతూనే అతనితో," సరే బాగుందోయ్! కానీ ఈ మధ్య ఏ పుస్తకాలు చదివావు? అసలు నువ్వీ నిర్ణయం ఎందుకు తీసుకున్నావు?"

" చదివాను సార్! రామకృష్ణ పరమహంస

చరిత్ర చదివాను. ఆయన శిష్యులు చాలా మంది సన్యాసం తీసుకుని గొప్పవాళ్ళైనారట సార్!''

'' ఓహో ! గొప్పవాళ్ళైనారా! వివేకానంద చరిత్ర చదివావా? ''

'' ఓ ! చదివాను సార్ ! అప్పటినుంచే నాకు ఊపు వచ్చింది, ఆయనలాగా అవ్వాలని వుంది. ఇంకా కొన్ని చదివాను. అందుకే అన్నీ వదిలేసి ధ్యానం చేసుకోవాలని వుంది.''

'' ఓహో ! అదా సంగతి! పురాణ వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము,స్మశాన వైరాగ్యము అని వుంటాయోయ్! అందులో మొదటిది నీదన్నమాట! ''

'' అంటే ఏంటి సార్ ! ''

'' ఏమి లేదు. ఏవైనా మంచి పుస్తకాలు చదివినప్పడు మనమూ అలా వుండాలని అనిపిస్తుంది. దానిని పురాణవైరాగ్యము అంటారు. ఇంతకూ నాదగ్గరకు ఎందుకు వచ్చావు ? ''

''ఏమి లేదు సార్ ! నేను వెళ్తానంటే ఇంట్లో వాళ్ళు ఒప్పకోవడం లేదు. నన్ను వెళ్ళనివ్వకుండా అడ్డుపడుతున్నారు. అదేమంటే తిట్టిపోస్తున్నారు. అందుకే మీకు చెప్పకోవాలని వచ్చాను. వాళ్ళకు మీరెట్లాగైనా చెప్పాలి సార్!''

'' సరే! వాళ్ళకు నేను చెప్తాను గానీ మరి నేను చెప్పేది నువ్వు వింటావా?''

'' తప్పకుండా వింటాను సార్ ! అందుకేగా నేను వచ్చింది''

'' ఒకవేళ నేను గూడ వద్దని చెబితే ! ''

'' అది మాత్రం ఒప్పుకోను సార్ ! ''

'' సరే ! ఒప్పుకోవద్దుగానీ, నేను చెప్పేది సాంతం విను''

'' సరే సార్ ! ''

'' నువ్వు వివేకానంద చరిత్ర చదివావు గదా ! మరి ఆయన మొదట ఏం చేసాడు ? ''

'' రామకృష్ణ పరమహంస దగ్గరకు వెళ్ళాడు ''

'' మరి నువ్వో?''

'' ఇంకా వెళ్ళలేదు సార్ ! ''

'' అంటే మొదట ఒక మహాత్ముని దగ్గరకు వెళ్ళాలన్న మాట ! అవునా ? ''

'' అవును ''

'' తర్వాత ఆయన సేవ చేసుకున్నాడు. నువ్వు గూడ అలానే చేయాలన్నమాట ! అంతే గాదు, అంతకు ముందే ఇంట్లోనే వివేకానందుడు చాలా సాధన చేసాడు. అది చదివావు గదా ! మరి అలాగే

కొన్నాళ్ళు ఇంట్లోనే వుండి సాధన చేయాలి. తర్వాత అటువంటి మహాత్ముడు గురువుగా లభించాలని ప్రతిరోజూ ప్రార్ధన చేసుకుంటూ వుండాలి ''.

'' మరి అప్పటి దాక ఎక్కడికీ వెళ్ళకూడదా? ''

'' వెళ్ళకూడదనే పెద్దలు చెప్పారోయ్ ''

'' అలా వెళితే ఏం సార్ ! ''

''వెళ్తేఏమవుతుందంటే-నువ్వుఇంట్లోయిన్ని సుఖాలు అనుభవిస్తున్నావు గనుక అవన్నీ లేకుండా వుండడం చాలా కష్టమౌతుంది. సరైన ఆహారం దొరకక, దొరికినా శరీరానికి సరిపడక అనారోగ్యం రావచ్చు. అప్పటి జీవితం మనం ఊహించినట్లు వుండదు. కొందరు దొంగ సన్యాసి అని తలచవచ్చు, తిట్టవచ్చు, కొట్టవచ్చు, పెట్టకనూపోవచ్చు. అల్లరి మూకలు అల్లరి చేయవచ్చు. ఇవన్నీ చూసి నీకు భయమెయ్యవచ్చు. ఇవన్నీ వద్దులే అని అప్పుడు నీకనిపించవచ్చు. కోరికలన్నీ నెట్టివేసుకుంటున్నావు గానీ వాటి మీద వ్యామోహం పోలేదు గనుక అవన్నీ కావాలని మళ్ళీ అనిపించవచ్చు. ఇలా తొందరపడి ఆవేశంలో సన్యసించి ఆ తర్వాత వచ్చే ఇబ్బందులను ఎదుర్కోలేక, అలాగని ఇంటికి తిరిగి రావడానికి ఆత్మాభిమానం అడ్డమొచ్చి తిరిగి రాలేక, రెండింటికీ చెడ్డ రేవడులై భ్రష్టసన్యాసులుగా

చాలామంది తిరుగుతూంటారు.వాళ్ళు నిజమైన సన్యాసులుగా వుండి భగవద్ధ్యాసలో వుండనూ లేరు, ఇటు సన్యాసం త్యజించి హాయిగా వుండనూ లేరు. కోరికలను అణుచుకోలేక చాటుమాటుగా తప్పుడు పనులు చేస్తూ వాటిని వేషభాషలతో కప్పిపుచ్చుకుంటూ భ్రష్ఠులౌతారు. ''

'' అయితే నన్నేం చేయమంటారు సార్! ''

'' ఇప్పుడు హాయిగా ఇంటికి వెళ్ళు. నీవనుకున్నట్లు అవడానికి మంచి ఉపాయం వుంది. ప్రతిరోజు నియమంగా జపము, ధ్యానమూ చేసుకో. సద్గురువు లభించాలని ' శ్రీ గురుచరిత్ర ' ను ఆర్తితో పారాయణ చేయి. శ్రీ సాయిలీలామృతము నిదానంగా చదువుతూ ఆయన చెప్పిన వాటిని గూర్చి ఆలోచిస్తూంటే అసలు ఆధ్యాత్మికత అంటే ఏమిటో, సాధన అంటే ఎలా చేయాలో, మహాత్ములంటే ఎలా వుంటారో తెలుస్తుంది. ఆర్తితో నిష్ఠగా పారాయణ చేయడం వల్ల నీకు సద్గురువు లభిస్తారు. అప్పుడాయన చెప్పినట్లు చేయవచ్చు. ఆయన సేవలో వుండవచ్చు. అప్పుడు తేలికగా భగవత్సాక్షాత్కారం అవుతుంది. ఇలా ఎక్కడికీ వెళ్ళనక్కరలేదు. అవసరమైతే వారే ఫలానా చోటికి వెళ్ళి తపస్సు చేసుకోమని ఆదేశిస్తారు. ఇప్పుడు నేను

చెప్పినది అర్థమైందా ? ''

'' అర్థమైంది సార్ ! అలాగే చేస్తాను. నాకింత వివరం తెలియదు.''

'' అందుకే ఏ విషయమైనా క్షుణ్ణంగా తెలుసుకోనిదే దూకరాదు, తెలిసిందా? ''

'' సరే సార్! ఒక్కమాట అడగవచ్చా ? మళ్ళీ అప్పుడప్పుడు మిమ్మల్ని కలుసుకోవచ్చా? ''

'' ఓ ! ఎప్పుడైనా రావచ్చోయ్ ! శుభం ! వెళ్ళిరా ''

అతడు అలా ఆదేశం పొందినవాడై పూజ్యశ్రీ మాస్టరుగారికి నమస్కరించి ఆశీస్సులు తీసుకుని వెళ్ళిపోయాడు. ఏ విషయాన్నైనా సరిగా ఆలోచించక క్షణికావేశంలో ముందడుగు వేసేవాళ్ళు ఎంతమందో ! పూజ్యశ్రీ మాస్టరు గారు చెప్పిన ఈ ఉత్తమ బోధ ఎంతో మందిని సరియైన మార్గాన నడిపించగలదని ఆశిద్దాము.

అలాగే ఒకసారి ఒకమ్మాయి పూజ్యశ్రీ మాస్టరు గారి దగ్గరకు వచ్చి కూర్చుంది. ఆ అమ్మాయి తరచూ వచ్చే అమ్మాయే. ఆ రోజు ఏదో బాధగాను, కోపంగానూ వుంది. పూజ్యశ్రీ మాస్టరుగారు ఆ అమ్మాయిని ''ఏమ్మా! బాగున్నావా!'' అని అడిగారు. అందుకా అమ్మాయి, ''ఆ '' అన్నది. ''పారాయణ

చేస్తున్నావా?'' పూజ్యశ్రీ మాస్టరుగారి ప్రశ్న.

''చేస్తున్నాను మాస్టారూ! కానీ ఇంక చెయ్యదలచుకోలేదు''

''ఏం? ఎందుకని''

''ఎందుకేముంది? చేసినందువలన ప్రయోజనమేమీ కన్పించడం లేదు. ఎన్నాళ్ళు చేసినా ఏ సంబంధమూ కుదరడం లేదు. ఎవరో రావడము, వాళ్ళముందు నేను బొమ్మలా కూర్చోడము, వాళ్ళు నన్ను చూడడము, వెళ్ళడము - ఇదీ తంతు. అందుకే ఇంక సాయిబాబాను పూజించదలచుకోలేదు''.

అందుకాయన నవ్వుతూ, ''హమ్మయ్యా! ఆయన నెత్తిన పాలు పోశావ్!'' అన్నారు.

''అదేంటి మాస్టారూ!''

''ఏముందీ, నువ్వుపారాయణ చేసావనుకో, పూజ చేసావనుకో, నీకు సంబంధం కుదిర్చాల్సిన బాధ్యత ఆయనకుంటుంది గదా! పైగా మంచి సంబంధం కుదర్చాలి. ఏదో ఒక సంబంధం చూస్తే చాలదు. నీకు నచ్చిన సంబంధమే కుదరాలాయె. మరి నువ్వు ఆయనను సేవించడం మానేస్తే ఆ శ్రమ ఆయనకు తగ్గించినట్లే గదా! ఆయన నెత్తిన పాలు పోసినట్లే గదా!''.

''మరి ఆయనను సేవిస్తుంటే కుదరట్లేదు

గదా! ఇంకెందుకు పూజించడం?''

''అదే నేను చెబుతున్నా. పోనీ మానేసేయ్''

''నాకు బాబా మీద భలే కోపమొస్తున్నది మాస్టారూ!''

''అవునామ్మా? ఆయన మీద కోపం రావడం సహజమే. మరి ఆయన మీద గాక ఇంకెవరి మీద వస్తుంది. ఎవరిమీద వస్తే ఎవరూరుకుంటారు గనుక''.

''ఎవరిమీదైనా ఎందుకు రావాలి?''

''నువ్వు సినిమాలు చూస్తావా?''

''ఆ! చూస్తాను.''

''నవలలు చదువుతావా?''

''చదువుతాను''

''మరి పెళ్ళి చూపులంటే ఇంకా అందంగా వుండాలని మేకప్ (ఫేషియల్) చేయించుకుంటావా?''

''అవును''

''మంచి చీరె కట్టుకోవాలనుకుంటావు గదా!''

''ఒకసారి ఒక చీరె కట్టుకుంటే వచ్చిన వారికి నచ్చలేదేమోనని ఈసారి అంతకంటే మంచి చీరె కట్టుకుందామని అనుకుంటావు కదా!''

''..........''

''మరి యిన్ని చేసినా సంబంధాలు కుదరడం లేదు గదా! మరి వీటి వేటిమీదా కోపం రావడం లేదా? మేకప్ చేసుకున్నందు వలన కుదరడం లేదు. అయినా మేకప్ చేసుకోవడం మానడం లేదు. నవలలు చదివితే కుదరడం లేదు గనుక అవి చదవడం మానుకోవచ్చు గదా! సినిమాల చూస్తే కుదరడం లేదు. సినిమాలు చూడడం మానుకోవచ్చు గదా! పైగా ఇవన్నీ డబ్బు పెట్టి చేసేవే. అయినా వాటిని మాత్రం వదులుకోలేవు. ఇంకా యింకా విసుగులేకుండా చేస్తూనే వుంటావు. మరి పాపం ఆ 'ముసలాయన' (బాబా) ఏం ఖర్చు పెట్టించాడని మానుకుంటావు. ఆయన చెప్పిన విషయాలేవీ చెడ్డవి కావు గదా? సినిమాలు, నవలలు మన కాలాన్ని హరిస్తాయి, చెడుకు దోహదం చేస్తాయి. ఆలోచించు, సాయిబాబా చరిత్ర చదివినందువలన నీకు కలిగేనష్టమేమిటి? పోనీ చదవడం మానేస్తే వివాహమవుతుందని నీకు నమ్మకముందా? గ్యారంటీ యివ్వగలవా? వుంటే అట్లాగే చెయ్యవచ్చు.''

''లేదు మాస్టారూ!''

''గ్యారంటీ లేనప్పుడు వాటిని ఎందుకు

వదులుకోలేకపోతున్నావు? వాటిమీద నీకు కోపం రాదు. ఇంకా యింకా చేస్తూనే వుంటావు. అవునా?''

''మరి ఏం చేయాలి?''

''ఇక్కడ నువ్వు ఒక విషయం ఆలోచించాలి. అసలు సాయిబాబాకు మనతో ఏమి సంబంధము? మనము ఆయనను ఎందుకు సేవిస్తున్నాము? ఆయనను పూజించినా, ఆయన చరిత్ర పారాయణ చేసినా ఆయనకు ఒరిగేదేమిటి? అసలాయన మన కోరికలు ఎందుకు తీర్చాలి?

''ఆయన తీర్చకపోతే ఎవరు తీరుస్తారు మాస్టారూ!''

''మరి ఆ సంగతి తెలిసే నువ్వెందుకు కోపగించుకుంటున్నావు?''

''ఇంకా తీర్చలేదు గనుక''

''ఎందుకు తీర్చలేదంటావ్?''

''అదే తెలియదు''

''అందుకే ముందు అది తెలుసుకోవాలి మనం. చరిత్ర చదివేది ఇవన్నీ తెలుసుకోడానికే. బాగా అర్థం చేసుకుంటూ చదవాలి. కోరిక తీరాలని గబగబా పేజీలు తిరగేస్తే ఆయన ఏది ఎందుకు చేస్తాడో అర్థంగాదు.

అసలు ఆయన గురించి నీ అభిప్రాయమేమిటి? ఆయన అన్నీ తెలిసిన వాడనే గదా!''

''అవును''

''నువ్వెందుకు ఆయనను పూజిస్తున్నావు? నీకేమీ తెలియదనే గదా!''

''అవును''

''అంటే ఆయనకన్నీ తెలుసని నీకు తెలుసు. నీకేమీ తెలియదని గూడ నీకు తెలుసు. అవునా?''

''అవును''

''మరి మన సంగతి అన్నీ తెలిసినాయన చేసినది సరియైనదా? లేక మనమనుకున్నదా?''

''ఆయన చేసినదే!''

''ఒక డాక్టరు వున్నాడుకో. ఆయనకు మన వ్యాధి ఏమిటో, దాని నివారణకు ఏమి ముందు యివ్వాలో తెలుసు. అందుకని డాక్టరు ఏమి చేసినా, అంటే ఆపరేషన్ చేసినా మనమేమీ మాట్లాడము. ఆయన మన మంచికే చేస్తున్నాడని అనుకుంటాము. అలాగే బాబాకు మన జన్మలు, కర్మలు తెలుసు. మన కోరికలు ఎప్పుడు ఎలా తీర్చాలో తెలుసు. అందుకని ఆయన మనకు శ్రేయస్కరమైనదే చేస్తాడని ఓర్పు వహించాలి. అంతే

గాదు, ఆయన సర్వ సమర్థుడు. అవసరమైన రీతిన మన కర్మలను మార్చగలడు, తీసివేయగలడు. నువ్వు ఆయనను సేవించలేదనుకో. నీ పూర్వకర్మ ప్రకారమే నీకు జరుగుతుంది. సేవించావనుకో. ఆయనకు నీ సమస్య తీర్చడానికి అవకాశముంటుంది. నువ్వు పారాయణ చేయకపోతే ఆయనకు పోయేదేమీలేదు. చేసినందువలన ఆయనక ఒరిగేదేమీలేదు. కానీ చేస్తే నీకే మంచిది. ఆలోచించు!''

''పారాయణ చేస్తాను మాస్టారూ!''

''ఆయన తల్లి వంటి వారు. మనం ఆయన బిడ్డలం. ఆయన ఎప్పుడూ మనకు శ్రేయస్కరమైనదే చేస్తారు. పారాయణ తప్పక చేస్తుండు, ఆయన లీల చూద్దువుగాని''.

పూజ్యశ్రీ మాస్టరుగారి మాట పొల్లుపోలేదు. ఆ అమ్మాయి పారాయణ చేసింది. మంచి సంబంధం కుదిరి పెళ్ళి జరిగింది. అంతేగాక అంతకు ముందు ఆ అమ్మాయికి వచ్చిన సంబంధాలన్నీ ఏదో ఒక రకంగా మంచివి కాదని తెలిసింది. వాటిలో ఎవరితో వివాహం జరిగినా కష్టమయ్యేదే! బాబా చేసిన మేలుకు కుటుంబమంతా కృతజ్ఞతతో, భక్తితో ఆయనను సేవించారు. పూజ్యశ్రీ మాస్టరుగారి

వద్దకు వచ్చి చెప్పి ఎంతో ఆనందించారు. పూజ్యశ్రీ మాస్టరుగారి పట్ల వారికి భక్తి భావం దృఢతరమైంది.

పూజ్యశ్రీ మాస్టరుగారు యిలా ఎందరికో బాబా పట్ల సరియైన అవగాహనను కలిగించారు. ఆయన చేసిన ఇలాంటి బోధలు ఎన్నో వున్నాయి.

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

పూజ్యశ్రీ మాస్టర్‌గారు శ్రితజన వత్సలుడు. ఆయన తమను ఆశ్రయించిన వారికి ఎన్నో విధాలుగా శ్రేయస్సు చేకూర్చారు. కొందరికి ఆయన అభయమిచ్చి రక్షించారు. కనుక ఆయన అభయ ప్రదాత. కొందరి వ్యాధులను ఆయన నివారించారు గనుక ఆయన భిషగ్వరేణ్యులు. మరికొందరికి ఆయన ప్రాణదానమే చేశారు గనుక ఆయన ప్రాణప్రదాత. ఇంకా ఎన్నో విధాలుగా ఎందరి సమస్యలనో పరిష్కరించారాయన. వాటిలో మచ్చుకు కొన్నింటిని చెప్పుకుందాము.

హిందీ పండితుడైన ఆర్.రామచంద్రారెడ్డి ఒకసారి పూజ్యశ్రీ మాస్టర్‌గారిని దర్శించి తన నిరుద్యోగ సమస్య గురించి చెప్పుకున్నాడు. అప్పుడు పూజ్యశ్రీ మాస్టర్‌గారు అతనితో, ''మీకు తప్పక ఉద్యోగం వస్తుంది. వచ్చాక నాకు తెలియపరచండి '' అన్నారు. అంతకుముందే అతని మిత్రులొకరు పూజ్యశ్రీ మాస్టర్‌గారి దగ్గరకెళ్ళి ఒక బాబా ఫొటోను ఆయన ఆశీస్సులతో తీసుకుంటే మీకు బాగుంటుంది అని ఆయనకు సలహా యిచ్చారు. కానీ అతడు తనకు ఆయన తాను అడగకుండానే

బాబా ఫొటోను యివ్వాలని తలచాడు. పూజ్యశ్రీ మాస్టర్‌గారు అతనికి ఉద్యోగం వస్తుందని చెప్పి, ''మీ దగ్గర బాబా ఫొటో వున్నదా?'' అని అడిగారు. అతడు లేదని చెప్పగానే ఆయన ఒక ఫొటో యిచ్చి పూజలో పెట్టుకోమన్నారు. ఆయన తన మనస్సు లోని కోరిక తీర్చినందుకు అతడు ఎంతో సంతోషించాడు. ఆ తర్వాత పూజ్యశ్రీ మాస్టర్‌గారు చెప్పినట్లే ఉద్యోగం వచ్చింది!

ఒక సాయి భక్తునికి ఒక క్లిష్ట సమస్య వచ్చింది. అతడు పరిష్కారం కోసం పై అధికార్లను ఆశ్రయించాడు. వారు సహాయం చేయకపోగా దుర్భాషలాడి పంపారు. అతడా విషయం పూజ్యశ్రీ మాస్టర్‌గారితో విన్నవించుకుని బాధపడ్డాడు. అప్పుడు పూజ్యశ్రీ మాస్టర్‌గారు, '' ఏమీ భయం లేదు. రేపు అధికారుల వద్దకు వెళ్ళు '' అని ఆశీర్వదించారు. అతడు అలాగే వెళ్ళాడు. ముందురోజే అతనిని తిరస్కరించిన అధికారులు ఆ రోజు ఎంతో ప్రేమగా అతనితో మాట్లాడడమేగాక అతని పని వెంటనే చేసి పెట్టారు గూడ. పూజ్యశ్రీ మాస్టర్‌గారి వాక్కు ఎంత అమోఘమో ఈ సంఘటనల వల్ల తెలుస్తుంది. ఆయన యిచ్చిన అభయం ఎంతటి ప్రభావం కలదో అర్థమౌతుంది.

అలాగే యన్. పర్వతరావుకు మొదటి సంతానం ఆడపిల్ల తర్వాత అతని భార్య గర్భం ధరించింది. కానీ జ్యోతిష్కుడు అతనికి మళ్ళీ ఆడపిల్లే పుడుతుందని చెప్పారు. అప్పటికి అతని భార్య ఐదవ మాసం గర్భవతి. అతడు పూజ్యశ్రీ మాస్టర్‌గారిని దర్శించి, విషయం వివరించి, తనకు మగ సంతానం కావాలని ప్రార్థించాడు. అప్పుడు పూజ్యశ్రీ మాస్టర్‌గారు , '' ఏమీ కంగారు పడవద్దు. శ్రీ సాయిబాబా జాతకాలను మార్చగల సమర్థుడు! '' అని వారికి అభయమిచ్చి వారిని కొన్ని పారాయణ చేసుకోమని చెప్పారు. వారలాగే చేసారు. వారికి మగబిడ్డ జన్మించాడు.

పూజ్యశ్రీ మాస్టర్‌గారు బిషగ్వరుడు. ఆయన చేసిన కొన్ని లీలలను ఇక్కడ చెప్పకుందాము.

చోడయ్యే అనునతడు చాలాకాలంగా రక్తవిరోచనాలతో బాధపడుతున్నాడు. పూజ్యశ్రీ మాస్టర్‌గారు ఒకసారి అతనున్న ఊరికి సత్సంగానికి వెళ్ళారు. అతడాయనను దర్శించి తన బాధచెప్పకున్నాడు. పూజ్యశ్రీ మాస్టర్‌గారు అతనికొక పదార్థం చెప్పి దానిని తినమన్నారు. అలా చేయగానే అతని విరోచనాలు తగ్గిపోయాయి.

పూజ్యశ్రీ మాస్టర్‌గారు విద్యానగర్‌లో

వుండగా తేలుకుట్టినవాళ్ళు ఎందరో వస్తుండేవాళ్ళు. ఆయన ఊదీ తీసుకుని తేలుకుట్టిన చోట స్వహస్తాలతో రాసి, చేతితో నిమిరేవారు. 5 ని॥లలోపలే నొప్పి తగ్గి సంతోషంగా తిరిగి వెళ్ళేవారు.

రామిరెడ్డి గోపాలరెడ్డి గారి పాప చిన్నప్పుడు చేతినుండి జారి పడిపోవడం వల్ల తలకు దెబ్బతగిలింది. 5సం॥ వచ్చినా నడకరాలేదు. ఒకరోజు పూజ్యశ్రీ మాస్టర్‌గారు వారింటికి సత్సంగానికి వచ్చారు. అప్పుడా పాప పారాడుతూ పూజ్యశ్రీ మాస్టర్‌గారి దగ్గరకు వచ్చింది. వాళ్ళు ఆ పాప విషయం ఆయనకు వివరించారు. పూజ్యశ్రీ మాస్టర్‌గారు తాను తీసుకుంటున్న పాయసంలోంచి కొద్దిగా ఆ పాప చేత త్రాగించారు. ఆ ప్రసాదం తీసుకున్న ఆ పాప మరునాటినుంచే నడవసాగింది. పూజ్యశ్రీ మాస్టర్‌గారు చేసిన అద్భుత లీలకు అందరూ ఆశ్చర్యపోయారు.

అంతేగాదు, పూజ్యశ్రీ మాస్టర్‌గారు మరణించిన ఒక కుక్కపిల్లను బ్రతికించారు. ఆయన ప్రాణ ప్రదాత గూడ.

ఒకసారి నెల్లూరునుండి కొందరు సాయిభక్తులు యాత్రకు బయలుదేరి పూజ్యశ్రీ మాస్టర్‌గారిని ప్రధమంగా దర్శించుకుని, వారి

ఆశీస్సులు తీసుకుని వెళ్దామని విద్యానగర్ వచ్చారు. పూజ్యశ్రీ మాస్టర్‌గారు సమయానికి సత్సంగహాలులో  కూర్చుని వున్నారు. ఆ సంగతి తెలిసి పూజ్యశ్రీ మాస్టర్‌గారి దర్శనం చేసుకోవాలనే ఆతురతలో ఒకరినొకరు తోసుకుంటూ పరుగుపరుగున మాస్టర్‌గారి ఇంటికి వెళ్తున్నారు. ఆ హడావుడిలో ఒక భక్తుని కాలు ఆ ఇంటి ముంగిట పడుకుని వున్న చిన్న కుక్కపిల్ల మీద పడింది. వెంటనే అది గిలగిలా తన్నుకుని చనిపోయింది. ఆ హటాత్సంఘటనకు ఆ భక్తుడు, మిగతా వాళ్ళు చాలా బాధపడిపోయారు. పూజ్యశ్రీ మాస్టర్‌గారితో ఆ సంగతి విన్నవించుకున్నారు. పూజ్యశ్రీ మాస్టర్‌గారు వెంటనే ఆ చనిపోయిన కుక్కపిల్లను తమ దగ్గరకు తెమ్మన్నారు. దానిని తీసుకుని తమ ఒడిలో వుంచుకుని దానిమీద కొంచెం ఊదీ చల్లారు. వచ్చిన వాళ్ళకు ఊదీ యిస్తూ, వాళ్ళతో మాట్లాడుతూనే దాని శరీరం తమ చేతితో నిమురుతున్నారు. కొద్ది నిమిషాలలోనే ఆ కుక్కపిల్ల మెల్లగా కళ్ళుతెరిచింది. తర్వాత లేచి నుంచుని బయటకు మామూలుగా నడుస్తూ వెళ్ళిపోయింది. ఈ అద్భుత సంఘటన చూసిన సభ్యులందరూ ఆశ్చర్యానందాలలో మునిగిపోయారు. పూజ్యశ్రీ

మాస్టర్‌గారు ఎంతటి మహాత్ములో మరొక్కసారి ఋజువైంది.

ఇలా ఆయన వద్ద జరిగిన లీలలు ఎన్నో!! ఎందరెందరికో కేవలం లౌకికమైన రక్షణను ప్రసాదించడమే కాక అద్భుతమైన ఆధ్యాత్మికానుభూతులను ప్రసాదించారు కూడా! ఆయన వద్ద యిన్ని లీలలు జరుగుతున్నా ఆయనమాత్రం ఎంతో వినమ్రంగా వుండేవారు. సర్వం తన గురువైన శ్రీ సాయినాథుని లీల అనేవారు. అలానే మెలిగేవారు. శ్రీ సాయి తమ వద్ద జరిగే లీలలన్నీ తమ గురుకృపేననేవారు కదా!

ఉత్తమ శిష్యునికి గురువుయందు ద్వైతభావమే వుండాలని పెద్దలు చెప్పారు. శ్రీ సాయి తామే పరమాత్మ అయినప్పటికీ తాము ''భగవంతుని బానిసను మాత్రమే'' అనేవారు. ''అల్లా మాలిక్!'' అనేవారు. అలానే పూజ్య మాస్టర్‌గారు సమర్థ సద్గురువైనప్పటికీ తాము కేవలం సాయిభక్తునిగానే మెలిగేవారు. సర్వం శ్రీ సాయి దయవలననే జరుగుతున్నాయి అనేవారు. ఆయన వినమ్రత ఎందరినో మాయ చేసేది. ఆయన సామాన్యుడనే భావము కలిగేది. పూజ్య శ్రీ మాస్టర్‌గారి గురించి ఎందరో మహనీయులు చెప్పిన విషయాలు

జాగ్రత్తగా పరిశీలిస్తే కాని వారెంతటివారో బోధపడదు.

**జై సాయి మాస్టర్!**

## జై సాయి మాస్టర్!

విశాల విశ్వం! అందులో కోటానుకోట్ల నక్షత్రగ్రహగోళాలు! ఎంత పరిశోధించినా ఇంకా ఎంతో తెలుసుకోవలసి వున్న చిత్ర విచిత్ర సృష్టి రహస్యాలు!! ఈ విశ్వం ఒక అక్షయ, అనంత, అద్భుత, విజ్ఞాన భాండాగారం! ఎవరు ఏ కోణంలో పరిశోధిస్తే ఆ కోణంలో కనిపించే గారడీ ప్రదర్శన (మ్యాజిక్ షో)!!

అందులో అనంతకోటి జీవరాశి! అనుక్షణం గణాంకాలకు అలవిగానన్ని జీవుల జనన మరణాలు!! ప్రతి జీవికీ 'నేను' అనే స్ఫురణ వున్న భావన! ఆ భావనవలన సృష్టిలో నిరంతరమూ జరిపే స్పందనలు - ప్రతిస్పందనలు!!

రోజులు, మాసాలు, సంవత్సరాలు, శతాబ్దాలు, యుగాలు, కల్పాలు - ఇలాగే కొనసాగుతున్న సృష్టి క్రమం!

అలాగే కొనసాగుతున్నా నిన్నటి రోజు ఈ రోజు ఎప్పటికీ కాదు, ఈ రోజు రేపు ఎన్నటికీ కాలేదు. ఇలా గతాన్ని తిరిగి ఇవ్వలేని కాలగతి!

ఇంతటి విశ్వంలోనూ అతి చిన్నది అయిన భూమి మీద ఎన్నో కోట్ల కోట్ల, కోట్ల కోట్ల - ఇలా

అంతులేని కోటానుకోట్ల భాగమైన అతి చిన్న చలన జీవి మానవుడు!
కానీ ఈ సృష్టిలోని ఏ జీవికీ లేని - మానవునికి మాత్రమే వున్న విశిష్టత - మనస్సు!

ఈ మనసున్న మనిషికి ఎన్నో ఆలోచనలు! ఎన్నో బంధాలు! ఎన్నెన్నో సంబంధాలు!! వాటి వల్ల కలిగే రాగ ద్వేష కామ క్రోధ ద్వేష అసుయాది భావాలు! వాటి వల్ల కలిగే సుఖదుఃఖాలు!
వాటితో అతలాకుతలమయ్యే మానవ జీవితాలు!!
ప్రతి మానవునికీ ఏదో పొందాలన్న తపన! పొందలేక పోతున్నామన్న ఆవేదన! అందువలన కలిగే అశాంతి! ఏమిటి ఈ మానవ జీవితం? ఈ జీవితాలు యిలా గడవవలసినదేనా? దీనికి అంతమెక్కడ?

ఈ రహస్యాన్ని ఛేదించాలనుకునేవారు కొందరు. సాధించి మహాత్ములుగా రూపొందినవారు ఏ కొద్దిమందో! అట్టివారే పూజ్యశ్రీ మాస్టరుగారు.

అంతా నశించిపోయేదే అయినప్పుడు ఈ తాపత్రయమేమిటి? మరణించిన తర్వాతది తెలియనప్పుడు మమకారాలెందుకు? అసలీ సృష్టి రహస్యమేమిటి? మానవజీవిత రహస్యమేమిటి? దీనికొక అర్థము, లక్ష్యము వున్నాయా?

ఇలాంటి ప్రశ్నలతో పూజ్యశ్రీ మాస్టరుగారు సమాధానాల కోసం అన్వేషించారు. సాధించారు. పరిష్కార మార్గాలు గూడ తెలుసుకున్నారు. పరమశాంతిని పొందారు.

అంతటితో ఆగక ఆయన తాము పొందిన ఆనందాన్ని అందరూ పొందాలని ఆరాటపడ్డారు. వారు ఆ మార్గాల గురించి, కర్తవ్యాల గురించి అనేక విధాలుగా బోధిస్తూ వుండేవారు.

అలా పూజ్యశ్రీ మాస్టరుగారు బోధించిన ప్రవచనాలలో కొన్నింటిని గూర్చి క్లుప్తంగా స్మరించుకుందాము.

*''పరిశోధించు; సాధించు''*

*''విశ్లేషించు; వివేచించు''*

*''పరిశీలించు; విశ్వసించు''*

*''శరణపొందు; సేవించు''*

*''శ్రమించు; పంచు''*

*''ఆచరించు; బోధించు''*

*''ప్రేమించు; క్షమించు''*

వీటిని గురించి పూజ్యశ్రీ మాస్టరుగారు యిలా వివరిస్తూ వుండేవారు.

### ***"పరిశోధించు; సాధించు"***

దేనిని గురించియైనా నిశితంగా, నిష్కర్షగా పరిశోధించు. దాని తత్త్వాన్ని గురించి లోతుగా ఆలోచించు. అప్పుడు దాని తత్త్వం అవగతమవుతుంది. అయితే ఏ విషయాన్నైనా క్షుణ్ణంగా తెలుసుకోవడానికి పట్టువిడవకుండా ప్రయత్నించాలి.

మూలాన్ని తెలుసుకోవాలి. మూలాన్ని తెలుసుకున్నట్లు గుర్తు ఏమిటంటే ఆ విషయంలో ఇక సందేహముండదు. మనస్సు శాంతిని పొందుతుంది.

### ***"విశ్లేషించు, వివేచించు"***

జీవితంలో జరిగే సంఘటనల గూర్చి విశ్లేషించు. అంటే సంఘటనలలోని, పరిస్థితులలోని మంచి చెడులు, పూర్వాపరాలు క్షుణ్ణంగా తెలుసుకోవాలి.

తర్వాత వివేకంతో ఆలోచించాలి. అంటే వాటిలోని సత్యాసత్యాలను గూర్చి నిష్కర్షగా, స్వార్థ రహితంగా ఆలోచించాలి. అప్పుడే సరియైన అవగాహన కలుగుతుంది. సరియైన నిర్ణయాలు తీసుకోగలుగుతాము గూడ.

## *"పరిశీలించు; విశ్వసించు"*

ఈ విషయమై ఆయన ఒకసారి ఇలా చెప్పారు. "జన్మనెత్తినందుకు గురువును తెలుసుకోవాలి. లేకపోతే ఎందుకు వచ్చినట్లు? పిడకల ఏరుకోడానికా?" అని బాబా చెప్పారు. కనుక మానవజన్మనెత్తినందుకు తప్పకుండా గురువును తెలుసుకోవాలన్నమాట.

అయితే గురువును తెలుసుకునేదెలా? అందుకు మొదట సద్గురువులు ఎలా వుంటారో వారి లక్షణాలేమిటో సంపూర్ణంగా తెలుసుకోవాలి. అట్టి లక్షణాలు అవతలి వ్యక్తిలో అంటే గురువుగా పెట్టుకోవాలి అనుకునేవారిలో వున్నాయోలేదో నిశితంగా పరిశీలించాలి. ఎన్ని విధాలుగానైనా అట్టివారిని పరీక్ష చేసుకోవచ్చు. అందుకు ఎంత కాలమైనా తీసుకోవచ్చు. మనం దేనినైనా - అంటే కూరగాయలనైనా సరే కొనడానికి వెళ్లినప్పడు అవి సరియైనవి అవునో కాదోనని ఎంతగానో పరీక్షిస్తాము గదా! అలాగే ఒక పెళ్లి సంబంధం చూడాలంటే ఎంతగానో అవతలి వారి వివరాలు గూర్చి విచారిస్తాము గదా! అలాంటప్పడు మన జీవితాన్నే సద్గురువుకు అప్పగించాలని తలచినప్పడు ఎంతగానో పరిశీలించవలసిన అవసరమున్నది.

అందుకని అప్రమత్తత లేకుండా, క్షుణ్ణంగా, అనుమానం లేని విధంగా పరీక్షించిన తర్వాతనే ఎవరినైనా గురువుగా ఎన్నుకోవాలి.

అయితే సరియైన గురువును ఎన్నుకోవడానికి మన పరిజ్ఞానం చాలదు గనుక సద్గురువు లభించాలని 'శ్రీగురు చరిత్ర' శ్రద్ధగా పారాయణ చేస్తే శ్రీ దత్తాత్రేయుడు స్వప్నదర్శనమిచ్చి నిజమైన సద్గురువును మనకు తెలుపుతారు. అప్పుడు అట్టి గురువును ఆశ్రయించడం సరియైన పద్ధతి.

సద్గురువును తెలుసుకున్న తర్వాత, వారిని తన గురువుగా భావించిన తర్వాత ఆయనను సంపూర్ణంగా విశ్వసించాలి. కానీ తగిన పరిపాకం లేకపోవడం వల్ల గురువును సంపూర్ణంగా విశ్వసించలేకపోతాము. అందుకని గురువు ఎంతటివాడో గుర్తుపెట్టుకుని మనస్సును సడలకుండా జాగ్రత్త వహించాలి. ఆయన సర్వజ్ఞుడని, సర్వ సమర్థుడనీ, మన ఐహిక ఆధ్యాత్మిక శ్రేయస్సు చేకూర్చేవారిని సంపూర్ణంగా విశ్వసించాలి.

***''శరణు పొందు; సేవించు''***

గురువును ఎన్నుకున్న తర్వాత వారిని శరణుపొందాలి. ఆయనే సర్వస్వము అనే భావనలో

ఆయనకు సేవ చేసుకోవాలి. ప్రాపంచిక జీవితంలో వున్నవాళ్ళు తమ బాధ్యతలను గురుసేవగా భావించాలి. ఆయన వాటిని తమకే అప్పగించిన బాధ్యతలుగా, ఆయన ఆజ్ఞగా భావించి కర్తవ్యాలను నిర్వర్తించాలి. అప్పుడు గురు సన్నిధిలో సేవ చేసినట్లే అవుతుంది. కారణం ఆయన ఎక్కడ లేరు గనుక? అదే సేవ చేయడమంటే. నిష్ఠ సబూరీలనే దక్షిణలను ఆయనకు సమర్పించి దక్షతతో సేవ చేసుకోవాలి.

**''శ్రమించు; పంచు''**

''కష్టపడి పనిచెయ్యి, దేవుని నామముచ్ఛరించు''

అన్నారు బాబా. అందుకని ప్రథమ కర్తవ్యంగా ప్రతి మానవుడూ కష్టపడి పని చెయ్యాలి. బాబా చెప్పిన ఈ సూక్తిలో ఎంతో అర్థమున్నది. కష్టపడి పనిచేయడం వల్ల కర్మ నశిస్తుంది. పుణ్యం లభిస్తుంది. ఋణ విముక్తి కలుగుతుంది.

ఈ పనిచేయడం తన కోసం మాత్రమే గాక ఇతరుల కోసం గూడ చేయాలి. అంతేగాక తాను సంపాదించిన దానిలో ఇతరులకు గూడ వినియోగిస్తూ వుండాలి.

భగవంతుడు మనకు సర్వాన్నీ ప్రసాదిస్తున్నాడు. ప్రకృతి తన సర్వస్వాన్నీ మనకు యిస్తున్నది. అలాగే

సూర్యచంద్రాదులు. పశుపక్ష్యాదులు, వృక్షాలు, నదులు - అన్నీ మనకు తమకంటూ ఏమీ మిగుల్చుకోకుండా దానం చేస్తున్నాయి. అలాగే మానవుడు గూడ ఇతరులకు సాధ్యమైనంతగా యివ్వడం నేర్చుకోవాలి. ఇది మానవుని కనీస కర్తవ్యం.

## **"ఆచరించు; బోధించు"**

ప్రతి మానవుడు ధర్మాన్ని ఆచరించాలి. ప్రాపంచిక విషయంలో గాని, పారమార్థిక విషయంలోగానీ ధర్మాచరణ అత్యంత ప్రధానమైనది. ధర్మం తాను ఆచరిస్తూనే ఇతరులకు బోధించాలి. తాను ఆచరించకుండా బోధిస్తే అది 'దంత వేదాంతము' అవుతుంది.
ధర్మం మీదనే శాంతి భద్రతలు ఆధారపడి వున్నాయి. ఈనాడు ఇంతగా విజ్ఞానం పెంపొందినా, దాని ద్వారా ఎన్నెన్నో సౌకర్యాలు, సౌలభ్యాలు లభించినా ధర్మాచరణ లోపం వల్ల ఇంకా ఇంకా మానవులు అశాంతికి గురి అవుతున్నారు.

ఒకనాడు ఎక్కడికైనా వెళ్లాలంటే పాదచారులుగానే వెళ్లవలసివుండేది. తర్వాత క్రమంగా సౌకర్యాలు వచ్చి దేశ విదేశాలకు గూడ

త్వరగా వెళ్లగలుగుతున్నాము. ఆనాడు వార్తలు చేరవేయడానికి మనుషులు కాలి నడకన, లేక గుఱ్ఱాల మీద వెళ్లవలసి వుండేది. ఈ రోజు ఫోను సౌకర్యంతో ఎక్కడి నుంచి ఎక్కడికైనా మాట్లాడుకోవచ్చు. ఇలా ఈనాడు సాంకేతిక పరిజ్ఞానం పెరిగిపోయి అన్ని విషయాలలోనూ అతి సులభమైన మార్గాలు కనుగొనడం జరుగుతున్నది. అందువలన మానవులకు ఎంతో శ్రమ తగ్గుతున్నది. సమయము కలిసి వస్తున్నది. అయినా నేడు శాంతిగా వుండలేకపోతున్నాము. అనుక్షణము అభద్రతాభావం పెరిగిపోతున్నది. ఈ విషయం గూర్చి నిశితంగా ఆలోచించవలసిన అవసరమున్నది. దానికి కారణం ధర్మాచరణ లోపమేనని చెప్పక తప్పదు.

నేడు చాలామందిలో భక్తి మేల్కొంటున్నది. చాలామంది ఏదో ఒక దైవాన్నో లేక గురువులనో సేవిస్తున్నారు. కానీ ఎక్కువ మందిలో ధర్మాచరణలోపం స్పష్టంగా కనిపిస్తున్నది.

చివరకు 'వంతులకు, కీచులాటలకూ పోవద్దు' అని చెప్పిన బాబాను సేవించేవారిలో ఎంతో మందిలో గూడ ఈ లోపం వల్ల వంతులు, కీచులాటలు, విభేదాలూ చోటు చేసుకుంటున్నాయి.

చాలా చోట్ల రాజకీయం తాండవిస్తున్నది. బాబా భక్తులలో గూడ స్వార్థం కనిపిస్తున్నది. అందువలన అవతలి వాడికి అపకారం చేయాలనే దుష్టతలంపులు చోటు చేసుకుంటున్నాయి.

వారు బాబా భక్తులే. బాబా ధ్యానము, పూజ, జపము, సేవలు బాగా చేస్తారు. తమకున్న వాటిని బాబాకు సమర్పించడానికి వెనుకాడరు. కానీ సాటివారి పట్ల వారి ప్రవర్తనలో మార్పు వుండదు. భేద భావము, స్వార్థము ప్రతిస్పందిస్తుంటుంది. ఉదాహరణకు ఒకడు మందిరాలలో జరిగే అన్నదానాలకు ఎంతైనా డబ్బు ఖర్చు పెడతాడు. కానీ బిచ్చగత్తెకు భిక్షమెయ్యడు. పేదవారికి సహాయం చేయడు. దీనిని బాబా హర్షించరు. హీనుల, దీనుల సేవ ఆయన స్వయంగా చేసి చూపించారు. పేద సాదలకు ధనం యివ్వడం చేసి చూపించారు. ఇలాంటి ఎన్నో లోపాలు బాబా భక్తులలో గూడ కొందరికి వుండడం విచారకమైన విషయం. అందుకనే ధర్మాచరణ అత్యంత ప్రధానమైనది. ప్రతి మానవుడూ ధర్మమాచరిస్తూ ఇతరులకు బోధిస్తూ వుండాలి. అప్పుడే మనం సుఖశాంతులతో వుండగలము.

## ''ప్రేమించు; క్షమించు''

సకల జీవులలోనూ ఆత్మయే వున్నదనిగాని, భగవంతుడే వున్నాడనిగాని, భావించినప్పడు అందరినీ ప్రేమించగలుగుతాము. అలాగాక సకల జీవులూ తనవంటి ప్రాణులే అనుకున్నప్పడు గూడ అసూయా ద్వేషాలు కలుగవు. ప్రేమించడమే జరుగుతుంది.

బాబా తాము అన్ని ప్రాణులలోనూ వున్నట్టు చెప్పడమేగాక అట్టి అనుభవాలను ప్రసాదించారు గూడ. అట్టి భావన నిలుపుకున్నప్పడు గూడ అందరినీ ప్రేమించడం సాధ్యమవుతుంది.

సాటి మానవులు గూడ తమ వంటి బలహీనతలు గలవారే అనుకున్నప్పడు వారి యొక్క స్వభావాలను గూర్చి పట్టించుకోక ప్రేమించడం జరుగుతుంది. ఒక్క మానవులేగాక ఇతరములైన వాటిని గూర్చి, వాటి తత్వములను గూర్చి ఆలోచించినప్పడు గూడ సకల జీవులనూ ప్రేమించడం సాధ్యమవుతుంది.

అప్పడు ఎవరియందూ, లేక వేటియందూ వున్న బలహీనతలు, లోపాలు లోపాలుగా కనిపించక ఎవరు ఎలా ప్రవర్తించినా క్షమించడమే జరుగుతుంది.

అలాగాక మన జీవితాలలోని ప్రతి సంఘటనలనూ బాబాయే ప్రసాదిస్తున్నారని తలచినప్పుడు గూడ అవతలి వారిని క్షమించడం జరుగుతుంది.

పూజ్యశ్రీ మాస్టరుగారు ఈవిధంగా మన శ్రేయస్సుకోసం ఎన్నో ముఖ్యమైన సూచనలు చెప్తుండేవారు. ఆయన ఒక్కొక్క విషయాన్ని గూర్చి ఎంతగానో వివరించేవారు. ఆయన చెప్పిన వాటిలో కొన్నింటిని క్లుప్తంగా మాత్రమే మనమిప్పుడు స్మరించుకున్నాము.

ఈ కృతజ్ఞతా మహోత్సవ సందర్భంగా పూజ్యశ్రీ మాస్టరుగారు ప్రవచించిన అమూల్య సూక్తులను విశ్లేషించుకుని, వివేచించి ఆచరించడానికి ప్రయత్నిద్దాము. సమర్థ సద్గురువులైన పూజ్యశ్రీ మాస్టరుగారిని శరణుపొంది, విశ్వసించి, సేవిద్దాము.

ఇటువంటి సద్గురువును, తన ముద్దుబిడ్డను మనకు ప్రసాదించినందుకు సమర్థ సద్గురువులైన శ్రీ శిరిడీ సాయినాథునికి వందన సహిత కృతజ్ఞతలు తెలుపుకుందాము.

**జై సాయి మాస్టర్!**

## పరమ పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మాస్టరుగారిచే రచించబడిన అపూర్వ గ్రంథములు

| | |
|---|---|
| శ్రీ సాయిలీలామృతం-శ్రీ గురుచరిత్ర | 200-00 |
| శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర | 90-00 |
| శ్రీ సాయిలీలామృతం | 70-00 |
| శ్రీ గురుచరిత్ర | 70-00 |
| శ్రీ సాయి సన్నిధి | 75-00 |
| శ్రీ సాయి మాస్టర్ ప్రవచనములు | 75-00 |
| శ్రీ సాయి నాథ ప్రబోధామృతము | 50-00 |
| సాయినాథ పూజ | 20-00 |
| సాయినాథ స్థవనమంజరి | 5-00 |
| శిరిడీ ఆరతులు | 6-00 |
| సాయిబాబాను సేవించడంఎందుకు | 5-00 |
| సాత్సంగను-భజన | 5-00 |
| శిరిడీ క్షేత్ర సందర్శనము | 10-00 |
| విజ్ఞానవీచికలు | 40-00 |
| పరిప్రశ్న | 40-00 |
| మతమెందుకు? | 20-00 |
| ఏది నిజం? | 25-00 |
| ధ్యాయోహాగ సర్వస్వం | 40-00 |
| బుద్ధధ్యాన హృదయం | 30-00 |
| దత్తావతార మహత్యం | 40-00 |
| సంహితాయన గురుద్విసహస్రి | 80-00 |
| పురుషసూక్త రహస్యం | 30-00 |
| సాయిసూక్తి-ఆచార్య వాణి | 5-00 |
| శ్రీ పాకలపాటి గురువుగారు | 45-00 |
| అవధూత శ్రీచీరాలస్వామి | 25-00 |
| అవధూత శ్రీ వెంకయ్య స్వామి | 40-00 |
| శ్రీ ఆనందమాయి అమ్మ | 30-00 |
| టిబెట్ యోగి మిలారేపా చరిత్ర | 45-00 |
| శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా చరిత్ర | 35-00 |
| స్వామి సమర్థ(అక్కల్కోట స్వామి) | 40-00 |
| మనము- మన సంస్కృతి | 55-00 |

## ఇతర ప్రచురణలు

| | |
|---|---|
| మహాత్ముల ముద్దుబిడ్డడు | 55-00 |
| అవధూత చివటం అమ్మ | 35-00 |
| శ్రీసిద్ధారూఢ స్వామి చరిత్ర | 40-00 |
| శ్రీ సాయి మాస్టర్ స్మృతులు | 75-00 |
| మరో నంద దీపం | 55-00 |
| ఆచార్య అమృత లేఖావళి | 40-00 |
| భగవాన్ శ్రీ భరద్వాజ | 125-00 |
| బాలల శ్రీ సాయి లీలామృతము | 25-00 |

## BOOKS IN ENGLISH

| | |
|---|---|
| Sai Baba The Master | 110-00 |
| Guru Charitra | 70-00 |
| Supreme Master (Swami Samartha) | 60-00 |
| Sai Baba of Shirdi and His Teachings | 60-00 |
| Life and Teachings of Hazarat Tajuddin Baba | 60-00 |
| Children's Sai Baba The Master | 70-00 |

## BOOKS IN OTHER LANGUAGES

| | |
|---|---|
| Sadguru Sai Baba(Hindi) | 100-00 |
| Sai Leelamrutam(Kannada) | 80-00 |
| Sai Baba Jeevitha Charitam (Malayalam) | 90-00 |
| Sai Baba Leelamrutam(Tamil) | 80-00 |
| Sri Guru Charitra(Hindi) | 50-00 |
| Sri Guru Charitra(Kannada) | 99-00 |
| Swami Samartha(Kannada) | 45-00 |
| Shirdi arathi(tamil) | 6-00 |
| Stavana Manjari | 3-00 |

SRI GURUPADUKA PUBLICATIONS
c/o, **Sri Manga Bharadwaja Trust**,
Bhakta Nivas, 12-1-170/46P, Hanuman Nagar,
Jaipuri colony, Nagole,Hyderabad-68
Phone :040-20063300
**Send DD in favour of "Sri Manga Bharadwaja Trust(Publications)", payable at Hyderabad OR Ongole**

# మహాపురుషుడు



**సమర్థ సద్గురు శ్రీ శిరిడీ సాయినాథుని ముద్దు బిడ్డడు పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ మహరాజ్ 75వ జన్మదిన మహోత్సవ సందర్భంగా కృతజ్ఞతా కుసుమాంజలి.**

SRI GURUPADUKA PUBLICATIONS
C/o SRI MANGA BHARADWAJA TRUST,
12-1-170/46P, HANUMAN NAGAR, JAIPURI COLONY, NAGOLE, HYDERABAD,
ANDHRA PRADESH - 500 068 www.saibharadwaja.org